౧౬ కుసుమము

సహకారగ్రంథమాల :-

సంపాదకుడు

వ. సత్యనారాయణ

# సహకారకౌముది





తూర్పుగోదావరిజిల్లా సహకారసమ్మేళనమువారిచే

ప్రకటితము

ఆలమూరు, తూర్పుగోదావరి.

1931



[ 0—8—0

# సహకారోద్యమము



సాంఘిక ఫలితములు :

సహకారము [illegible] సాంఘికఫలములుకూడ మిగుల నద్భుతమైనవి. [illegible] సహకారపరపతిసంఘములు సంఘీయులకు పైకమును భారవహామగు [illegible] యప్పులను దీర్చుట కొఱకే గాక, విత్తులను, యెరువులను, సేద్యమున కుపకరించు యెడ్లను గొనుటకును, ఇండ్లను కట్టుకొనుటకును, భూమిని క్రయ మొనరించుటకు మాత్రమే కాక, పెండ్లిండ్లకును, యాత్రలకును, శ్రాద్ధక్రియలకును గూడ నొపగుచుండును. ఖర్చునందు ఫలయుతమును, ఫలయుతము కానిదియు నను భేదములు గాక అవసరమును, అవసరము కానిదియు నను వ్యత్యాసములు కలవు. అందుచే పెండ్లిండ్లకును, శ్రాద్ధములకును, పుణ్యతీర్థగమనములకును అప్పు లొసగబడును ;—యిట్టి ఖర్చులకై సంఘములు ఋణముల నొసగనిచో సంఘీయులు షాహుకారుల పంచజేరి, తొంటివిధమున పెద్దవడ్డీలకు వడ్డీలను దెచ్చుకొని, తలమించిన వ్యయములను చేయుచు ముప్పు దెచ్చుకొందురు.

ఇట్టి వెచ్చములకై కావింపబడిన దరఖాస్తు పైకము
లను పంచాయతులు చాల చోటులందుఁ తగ్గించివైచెను.
వివాహాది సాంఘికోత్సవములందు పల్లెయందలి ప్రజల యభి
ప్రాయమువలని భయముచేతనే యెట్టి నికృష్టసంసారియైనను,
పెద్దమొత్తములను వెచ్చించుచు ముప్పు దెచ్చుకొనుచుండును.
సహకారోద్యమము భారతపల్లెలందు క్రమక్రమాభివృద్ధి గాం
చుచున్నకొలది భయావహమగు ప్రజల యభిప్రాయము
విద్యాసేచనముచే ననుకూలముగ మార్పుజెందినది. కావుననే
ప్రస్తుత పల్లె ప్రజాభిప్రాయము సాంఘికోత్సవములందు వ్యయ
మును తగ్గింపుమనియే గృహస్థున కుద్బోధించుచున్నవి. తండ్రి
మరణించినందువలన, దుర్భరదుఃఖభారముచే క్రుంగి కృంగి
పెద్ద యప్పుజేసి మూకలై యిలుజేరు బంధువులకును, పల్లె
వాసులకును పిండివంటలతో విందులు గుడవబెట్టి గృహస్థుఁ
డొకప్పుడు దురంతమైన ముప్పునకు గుఱి గావలసివచ్చెడిది!
కొడుకునకుగాని, కొమరితకుగాని పెండిలిచేసి మిథ్యామర్యా
దను పరిగణించి స్వార్థపరులును భోజనపరులును నగు ప్రజల
సదభిప్రాయమునుబడయ నాతురపడి ఆర్థికముగ దీఱని కష్టము
లను దెచ్చిపెట్టుకొనిన గృహస్థు లెందఱు లేరు? సహకారము
కతన ప్రజాభిప్రాయము మార్పుజెందుటచే వివాహాది యుత్స
వసమయములందు గృహస్థుఁడు వ్యయము తగ్గించి, గభీర
ఋణకూపమునుండి తొలగుచున్నాఁడు. సహకార పరపతిసం
ఘముయొక్క కార్యవిధానమును, కఠిననియమములును దుర్వ్య

య దురాచారము నరికట్టుచుండెను! తోడిసభ్యుడు తాహతునకు మించిన ఖర్చులను చేసి తన యాస్తిబలమునకును, తన పరపతిబలములకును భంగము దెచ్చుకొనినయెడల, పరిమితిలేని పూచీకి బద్ధులగుడు సంఘమందలి సభ్యులెల్లరకు గూడ నార్థికముగ ముప్పుగలుగుట తథ్యముకదా! సంయుక్త రాష్ట్రములందు 1911—12 సంవత్సరమందు సహకారసంఘముల కార్యక్రమమును పరిశీలించుచు సర్ జేమ్సు మెస్టన్ గారు సహకారోద్యమము కతన గోచరించిన సాంఘికఫలితములను గుఱించి యిట్లు వాక్రుచ్చిరి:

"ఈ యుద్యమము కతన పల్లీయులందు సంఘీభావము తలయెత్తెను. గ్రామమందలి వివాదములను పరిష్కరించుటకును, దుర్వ్యయదురాచారమును మాపుచేసి పొదుపును, మితవ్యయమును ప్రజలందు పెంపొందించుటకును దగు యధికారము పల్లెలందు చూపట్టుచున్నది. ఈ యుద్యమము ప్రజాభిప్రాయమునకు బల మొసగుచు, పంచాయతులకు మార్గము జూపుచుండెను. సహకారసంఘనిర్మాణవిధానము కతన నొక యూరునకును, చేరువను గల మఱొక పల్లెకును సంఘీభావ మలవడుచుండెను. సౌజన్యసౌహార్దభావములను ప్రజలం దభివృద్ధిపఱచి, నూతనగ్రామజీవనము నుజ్జీవింపజేసి, సహకారోద్యమము పల్లెనాగరికతకును, విద్యాపురోభివృద్ధికిని జేయూత యొసగుచుండెనని యుత్సాహపురస్సరముగ రిజిష్ట్రారు వచించుచుండెను."



ఆర్థిక ఫలములు ;

సహకారోద్యమముయొక్క ఆర్థికఫలములు గూడ మిగుల నమోఘమైనవి! మూలబడి మూలుగుచు, నిష్ప్రయోజనమైన నిక్షేపముల నీయుద్యమ మాకర్షించినది! దుర్వ్యయములు సలుపుచు విచ్చలవిడిగా దిరుగు ప్రజ లనేకులందు పొదుపుగుణమును పెంపొంద జేసి, వడ్డీలపై వారి కడనుండి నిల్వపైకముల నాకర్షించినది!! పరపతిసంఘముల విజయపురస్సరకార్యవిధానమును విలోకించు ప్రజలకు వానియెడ విశ్వాసముజనించెను. దానంజేసి తమకడ నిల్వయుండి, యేపనికిని పనికి రాకయుండిన పైకపుమొత్తములనువారు సంఘబ్యాంకునందు వడ్డీకై నిలువవేయందొడగిరి. మిగుల శ్రమపడి సంపాదించి, తాము దాచుకొనిన పైకమును నిలువ వేసికొనుటకు అనువగు తావు లభించినందులకు వితంతువులును, వృద్ధులును ముదమందిరి. బంగాళాదేశమందు సహకార పరపతిసంఘముల కార్యవిధానమును గుఱించిన నివేదికలనుండి కొలదివింత దృష్టాంతరముల నిందు దెలుపుదుము: మిధునాపురమం (Midnapore) దు ఎక్కువ వడ్డీలకు పైప్రజలకు అప్పుల నొసగు షావుకా రొక డుండువాడు. ఆయూరిలో నున్న సహకారపరపతిసంఘమందలి సభ్యులు నిల్వమొత్తముల నొసగి సంఘమునకు సాహాయ్యము చేయుమని పలుమారు షావుకారుని వేడిరి. కాని, యత డెన్నడు వారి వేడికోలును మన్నింపలేదు. ఇట్లుండ నొకనా డాతడు ఆకస్మిక

ముగ్గ మరణించిన మగఁడు చనిపోయిన మూఁడవనాఁడు మైనరులగు పిల్లలతరఫున వితంతువు ఎనిమిదివందల రూకలను స్థానిక సహకారపరపతిసంఘమందు నిలువవేసెను! ఆయూరిలోనే వసించు నొక సామాన్యగృహస్థుఁడు, ఒక కాసైన నిల్వవేయజాలువానివలె గన్పట్టకుండిన వ్యక్తి పల్లెయం దేమూలనో దొంగతనము జరిగెనను దుర్వార్త విని తన కొంపకుగూడ నట్టి చేటు మూఁడునేమో యని వెఱగంది నూఱురూకలను పరపతిసంఘమందు నిలువవేసికొనెను! ఖుల్నా యను పురమందు పాలకీ మోసికొని బ్రదుకు నిరుపేద యొకడు పండ్రెండువందల రూకలను పరపతిసంఘమునకు నిల్వకై తెచ్చి ప్రజల నందఱ నాశ్చర్యమగ్నులను జేసివైచెను. ఈ పెద్ద మొత్తమునా నిరుపేద క్రమక్రమముగ సంచిత మొనరించిన పైకము కాదా! మిగుల నప్రమత్తుఁడై యాతఁడు జీవనము గడుపుచుండువాఁడనియు, చాల పైకము నాతఁడు భూమిలో బాతియుంచెనని ప్రజ లూహించువారనియు వాక
వచ్చెను!

1914_15 సంవత్సరమందలి
లాండు రివిన్యూ మెడ్మినిస్ట్రేషన్ నివేదిక
యొక్క ఆర్థికఫలితముల నుగ్గడించుచు ని
“టకవి శాసనముల ననుసరించి రాజధాని
కము గతవత్సర మొసగిన యర్థమం దర్థ
యధికముగనున్నది.వ్యవసాయపరిస్థితుల

దీనిముఖ్యహేతుకము. సహకారోద్యమము అభివృద్ధినందుచున్న కొలది వ్యవసాయదారుడు ఆర్థికసహాయమునకై తోంటివలెగాక గవర్నమెంటువారిపై నాధారపడుటకు విముఖుఁడగుచుండెను."

భారతదేశమందలి పరపతిసహకారోద్యమముయొక్క ఆర్థికఫలితములను మహాసీయుం డగుడుల్బ యిట్లు సంక్షేపముగ వివరించుచుండెను. "అర్థము మిగుల నావశ్యకమగు ప్రదేశములకు సముచితరీతిని సహకారోద్యమము ధనమును గొనివచ్చెను. ధనాభావముచే గ్రుంగిపోవు పలువురనీయుద్యమము దివాలానుండి కాపాడెను. ప్రతికూలపరిస్థితులందు మునుంగ నున్నవారికిఁ జేయూఁత నొసంగి రక్షించెను. ఎక్కుడు వడ్డీలకు ఋణముల నొసంగి, నిరుపేదలవ్యాద్రక్తము పీల్చివేయు కఠినులగుషాహుకారుల బారినుండి వేలకొలది ప్రజలు విడివడిరి! అనేకగ్రామములం దిట్టి షాహుకారుల దుర్వ్యాపారము కడముట్టెను! ఋణభారముచే గ్రుంకిపోవు వారికీయుద్యమము ఆశ యనువెలుగును జూపి, ఉత్తమ జీవనమునకు మార్గదర్శక మాయెను."

ఈ విషయమునుగుఱించియే సర్ ఎడ్వర్డు మక్లాగన్‌గారిట్లు వచించిరి. "వడ్డీయందు వేయబడిన నిలువనుమాత్రము పరిగణించితిమేని, ఉద్యమమువలన గలుగుమేలు క్రమక్రమాభివృద్ధినందుచున్నదని నొక్కి వక్కాణింపవచ్చును. సంఘముల వలన వ్యవసాయదారులకొసగబడిన ఋణములందలి నిల్వ పైకము నూటికి పదిచొప్పున గోచరించుచున్నది. సహకార

సంఘములవలన నొసఁగబడు ప్రతి కోటిరూకల పైకమందు పది లక్షల రూకలధనము నిల్వ యగుచు అనవసరమగు భారము నుండి సేద్యకాని గాపాడుచుండెను."

పరిపతిసహకారము అన్యాపగముగనైన భారతవాణిజ్యమును, పరిశ్రమలను అభివృద్ధిపఱుపజాలు ననుట నిర్వివాదాంశము. వ్యవసాయదారుల మస్తకములనుండి ఋణభారమునుదొలగించివారిక్రయబలము (Purchasing Power)ను వృద్ధి గావించి ఈ యుద్యమము వాణిజ్యవస్తువులకును, పరిశ్రమపదార్థములకును ప్రజలం దధికస్థాన మొసగును. వడ్డీరేటును తగ్గించి కేవలము వ్యవసాయమునకే వెచ్చింపబడు పైకమందలి కొంత భాగమును పరిశ్రమలదెస ద్రిప్పి సహకారోద్యమము భారతవాణిజ్యమును పెంపొందింప జేయఁగలుగును! వ్యవసాయమువలె నెక్కువ వడ్డీలను జెల్లింపజాలక, ధనాభావముచే వెనుకబడిన ముఖ్యపరిశ్రమ లన్నియు, వడ్డీ బరువు తగ్గుటచే లభించు పైకముమూలమున గ్రమక్రమాభివృద్ధి నందఁజాలుట నిక్కము! కావున వాణిజ్యరంగమున సహకారోద్యమమువలనఁ గలుగుమేలు అనూనమైనదని ఘంటాపథముగఁ దెలుపవచ్చును.

సహకారోద్యమమువలన గోచరింపఁజాలు పాలనాఫలితములు :

ఐదవ వంగదేశీయరాష్ట్రసహకారసభయందు 1913 సంవత్సరమున కార్మైకేల్ ప్రభువు తన తొలియుపన్యాస

మున నిట్లు వచించెను. "వంగదేశపరిపాలనమందు నీటి సప్లయియందుగాని, ఆరోగ్యాభివృద్ధియందుఁగాని, మలేరియా జ్వరమును ప్రతిఘటించుటందుఁగాని ప్రజలకు సంబంధించిన యేముఖ్యసమస్యనైన పరిష్కరించుటందు స్థానికప్రయత్నము ముఖ్యమైనది. గ్రామసంస్థ లిపుడు మృగ్యమై యుండుటచే యిట్టి ప్రయత్నము కొనసాగుట అసాధ్య మగుచుండెను! ప్రాచీన భారతౌన్నత్యమునకు మూలబంధము లై యుండిన గ్రామసంస్థలవలెనే ప్రజాపురోభివృద్ధికై సహకారసంఘములు తోడ్పడఁజాలుననియు, నీ దేశ భావిపరిపాలనముం దవి యనుకూలమగు మార్పులకుఁ దెరువు జూపజాలుననియు నా నిశ్చితాభిప్రాయము."

ఈ సభయందే మాట్లాడుచు పి. సి. లయన్‌గా రిట్లు వచించిరి. "జయయుక్తమగు గ్రామసంఘము విద్యాభివృద్ధికిని, స్థానిక స్వపరిపాలనమునకు జేయూఁత యొసఁగి పల్లె సామ్రాజ్య పునరుద్ధరణమునకుఁ దోడ్పడుననుట నిర్వివాదాంశము." 1914 వ సంవత్సరమున జరిగిన ఆఱవ వంగ రాష్ట్ర సహకారసభలో తమ యధ్యక్షోపన్యాసమున లయన్‌గా రిట్లు వచించిరి. "భావిరాజ్యాంగవిధానములకు సహకారసంఘములు దృఢమగు మూలబంధము లగుననుట నిస్సంశయము. ప్రతిగ్రామమందుగల సహకారసంఘము ప్రజాభ్యుదయమునకు సంబంధించిన ప్రతివిషయమందును పల్లీయులను జేర్చి పాలనాంశములందు వారి నాఱితేఱిచి యెన్నిక

లందు ప్రధానస్థాన మగుగాకని కోరుచుంటిని. అనేక యూని యనులు కలిసిన కవున్సిల్ (సభ) యందు పల్లెను గ్రామ ప్రజాభ్యుదయకాంక్షి యనునొక ప్రతినిధిని ప్రత్యేక గ్రామ సంఘసంస్థ యెన్నుకొనవలయును. ఈ కవున్సిల్కంటె పెద్దవి యగు సభలు ప్రతినిధులను ఎన్నుకొనుటకీప్రతినిధి తోడ్ప డును." మార్పు జెందిన లెజిస్లేటివ్ కవున్సిలుల యెన్నిక లందు సహకార పరపతిసంఘములు చాల కృషి సలిపి యుండెను. ఎన్నికల ప్రాముఖ్యతను ప్రజలు బాగుగ గుర్తించి, స్వపరిపాలనావిధానమును రాజకీయవిద్యను హృద యంగమము గావించుకొనదొడగిరి.

సహకార పరపతిసంఘ మన్నివిషయములందు పల్లీ యులకు రక్షణమై యుండుట మనము గుర్తించితిమి. పల్లె వాసుల పైకమును భద్రపఱచి అవసరమగునపు డప్పులనిచ్చు బ్యాంకుకై పల్లీయుల వివాదములను పరిష్కరించు న్యాయ స్థానమై, గ్రామస్థులకు విద్యగఱపు పాఠశాలయై, గ్రామ వాసుల యారోగ్యమును పెంపొందించు సంస్థయై యీ సంఘము పెంపొందుచున్నది. ప్రజా స్వపరిపాలనమునకు ప్రధానసంస్థలై యభివృద్ధిగనిన ప్రాచీనగ్రామసంఘము లీసహ కారసమ్మేళనములందు పునరుద్ధార మందుచుండుట ప్రమోద కరము. మిగుల నిరుపేదయగు వ్యవసాయదారుడైనను, గడు నవలీలగ నీ గ్రామసంఘములందు ఉన్నతవిద్య నంది, అనవ రతము దొరతనమువారి సాహాయ్యముపై నాధారపడక

స్వయంసహాయముచే నాత్మోన్నతి గనుచు, తోడి మానవు నకు చేయూత నొసగుచు, అప్రమత్తుడై మితవ్యయమును సలుపుచు, నిర్దిష్టసమయమున నియమానుసారము పైకము చెల్లించుచు, న్యాయముగ ప్రవర్తించుచు, పరిసరవాసులందు సంఘీభావమును, పరస్పర సౌహార్ద్యమును నెలకొల్పుచు సుఖముగ నుండఁజాలును!

సహకారపరపతి, కమతపు ఋణము :

గడచిన పదేండ్లలో వ్యవసాయదారుల ఋణభార మును తగ్గించుటలో పరపతిసహకార మొనరించిన కృషి నించుక యుల్లేఖించు టుచితము. ఈ విషయమును విమర్శించు టకై మైసూరునందలి సహకారసంఘముల రిజిష్ట్రారు తగు యత్నములను గావించెను. సేద్యకాండ్ర ఋణభార మెప్ప టట్లు నిలిచియున్నట్లును, సహకారసంఘములందలి సభ్యులు సంఘములకంటె నధికముగా షావుకారులకు ఋణపడి యు న్నట్లును ఈ రిజిష్ట్రారు నిర్దేశించెను. ఋణములు తీర్చుటకు సహకారసంఘములకంటె షావుకారులు అధిక సమయ మొసగుట యిందులకు హేతువని ఈతఁడుసూచించెను. అధిక కాలపరిమితి నొసగు షావుకారుల దురుద్దేశములను గ్రహిం పజాలక కమతముదారులు వారి మాయావాగురమునఁ బడు చుండిరనియు, విద్యాప్రచారమిాలోపమును మాపు చేయ జాలుననియు మైసూరు రిజిష్ట్రారు వ్రాక్రుచ్చెను.

పంజాబు సహకారశాఖయందు పనిచేయు ఎం. సి. డార్లింగుగారు కూడ కతిపయసంవత్సరములనుండి వ్యవసాయ ఋణమును గుఱించిన లెఖ దబిసీళ్లను విమర్శించుచుండెను. హిందూదేశపు ఆర్థికసమస్యలను చర్చించు యొకపత్రికయందు ("Indian journal of Economics") "ఐశ్వర్యము, పాంచాలమండలి ఋణము" అను శీర్షిక క్రింద వ్రాసిన వ్యాసమం దీతఁడు పంజాబునందు తనఖాఋణము పదునేనేండ్ల (1903—1917) లో పదికోట్ల రూకలవఱకు హెచ్చెనని వ్రాసియుండెను. ప్రాతయప్పులు తీఱుచున్నను, తనఖాలపై చేయబడు క్రొత్తఋణముల సంఖ్య యధికమగుచుండుటయు, ఒకరూక తనఖాయప్పుతో హానిలేని మఱొక రూక ఋణముండుటయు గుర్తించి, పదేండ్లలో పాంచాలమందు వ్యవసాయఋణము పదివేలపౌనులకంటె నధికమాయెననియు నాతఁడు నిశ్చయించెను. మఱి రెండేండ్లు కడచినపిదప మరల నిట్టి విమర్శనమే సలిపి భూస్వాములందు దామాషాయిని ప్రతివాఁడును ఐదువందలరూకల ఋణమును గలిగియుండెననియు, భూమి ఖామందు లందు నూటికి పందొంబదుగురుమాత్రము ఋణము లేనివారై యుండిరనియు, పంజాబురాష్ట్రమందు కమతముదారుల మొత్తపుఋణము నలువది, యేబదికోట్ల రూకల నడుమనుండుననియు డార్లింగుగారు వచించిరి. తోడ్తోడనే ఋణభారమును తగ్గించుటందు పాంచాలమున సహకారము కావించిన మేల్మనుగూడ నాతఁడు పరిశీలించెను.

సహకారసంఘములందలి సభ్యులలో నూటికి రువది యెనమండుగురు ఋణ ముక్తులగుటయు, తక్కుగలవారి యప్పునం దర్ధభాగము తీఱుటయు నతడు కనిపెట్టెను. క్రమక్రమముగ నిట్లు ఋణనిర్మూలమగుచుండ, ప్రతి సభ్యుని ఆదాయము రు 237 ల చొప్పున నధికముగాఁ బదునేనుసంవత్సరములలో రైతు యార్థికపరిస్థితుల నభివృద్ధిపఱచుటందు సహకారోద్యమ మీరాష్ట్రమం దెట్టి యద్భుతకృషి సలిపెనో యవలీలగ నూహింపనగును. సహకారనిబంధనముల ననుసరించి యే సభ్యుడును యిచ్చవచ్చిన తెఱగున ఋణము సలుపరాదు. పరపతిసంఘములు సంఘీయులకు నిర్దిష్టసమయములందు పైకమును చెల్లించుట, న్యాయప్రవర్తనము, మితవ్యయమును ఉద్బోధించును. సంఘపరిస్థితులను పరిశీలించి, అప్పుగాగొనిన పైకము ప్రయోజనయుతక్రియలకు వెచ్చింపబడుట గమనించి, ప్రతిసభ్యునియొక్కయు వార్షిక ఆదాయమును, వ్యయమును విశదములతో బరిశీలించితిమేని భారతకృషీవలుని యార్థిక పరిస్థితులు సహకారము మూలమున నభివృద్ధి నందుచుండెనని గ్రహింపజాలుదుము.

# ఒకటవ అధ్యాయము



## సహకారేతర వ్యవసాయబ్యాంకులు, సహకార పరపతిసంస్థలు, వాని భేదములు.

హిందూదేశ యార్థికసమస్యలను చర్చించు నొక పత్రిక (The Indian journal of Economics) యందు భారత యార్థికపరిస్థితుల నొక వ్యాసమును విమర్శించుచు, సర్. డిన్‌షావాచాగారు గవర్నమెంటువారి సాహాయ్యమున వ్యవసాయబ్యాంకులు నిర్మింపబడవలెననియు, సేద్యకాండ్రను గుంగదీయు ఋణభారమును తగ్గించుట కవియే ముఖ్య సాధనములనియు వచించిరి. కమతముదారులను ఋణవిముక్తులను జేయుట మన ప్రధానోద్దేశ మగుచో, ప్రస్తుతము నెలకొలుపబడిన పరపతి సహకారసంఘములు నిరర్థకములని మన మెఱుగవలెనని యాతడు పలికెను. వ్యవసాయఋణభారమును తగ్గించుటందు బ్యాంకుల పటుత్వమును నిరూపించుటకై ఈజిప్టుదేశమందలి వ్యవసాయబ్యాంకు సలిపిన కృషిని వాచాగారు దృష్టాంతరముగా గొనిరి. డిన్‌షాగారివంటి అర్థశాస్త్ర పండితుడును, రాజకీయవేత్తయు నుడివినపల్కులందలి సత్యాసత్యములను విపులముగ చర్చించు టవసరము.

సహకారసంఘములవలన గలుగు బాగోగులను విమర్శించుట తమపని గాదని తమ వ్యాసమ్మం దొకచో వాచా

గారు వాక్రుచ్చిరి. కాని యీ సంస్థల నిర్మాణమును, కార్యక్రమమును, వీనిపై దొరతనమువారికిఁ గలయధికారమును వీనిని తుదముట్టించునని నుడువుచు సహకారసంఘములపై గల తమ జుగుప్సాభావమును వాచాగారు వెల్లడించిరి. టకవి ఋణవిధానమును, దక్షిణసీమ సేవ్యకాని ఋణవిముక్తి గావించుట కొనరింపబడిన ప్రయత్నములును వితథమైనట్లు వ్యవసాయ పరపతిసంఘములు కుంటుబడిపోవునని యీతని యభిప్రాయము.

సర్. డిన్షావాచాగారి వచనముల సత్యాసత్యముల నెఱుగఁదలచిన వ్యవసాయబ్యాంకుల చరిత్రము నంతయు పరిశీలించి, సహకారబ్యాంకుల యవసరము లేనిచోఁ బ్బాన వ్యవసాయఋణభారమును తగ్గించుటకై యవి చేసిన విశేషకృషిని విమర్శించు టవసరము. ఈజిప్టుబ్యాంకువలనఁ గలిగిన ప్రయోజనమును, ఈ బ్యాంకువిధమునకును, వాచాగారి యుద్దేశమునకును గలపోలికనుగూడ పరిశీలించుట ముఖ్యము. సహకారయూనియనులును, సెంట్రలు బ్యాంకులును, వ్యవసాయ బ్యాంకులు చేయజాలు ఉపకారమును చేయజాలునేమో యోజింపవలెను. ఈ బ్యాంకులను స్థాపించి, వానిచే పని జరిగించుటందు ప్రతిఘటించు యిక్కట్టులనుగూడ మనము గుర్తింపవలెను. కేవలము వ్యవసాయబ్యాంకులనుండి లభింపజాలని ఆర్థిక, నైతిక, రాజకీయసౌకర్యములు సహకారము ద్వారా లభింపఁగలవేమోకూడ మనము కనుగొనవలెను.

సేద్యకాని బూర్తిగ ఋణవిముక్తుఁ గావింపవలెనను వాచాగారియాశయము సిద్ధింపజాలునాయని మన మూహింపవలెను. ప్రపంచమందలి యార్థికపరిస్థితులను పరిశీలింప నేతెఁగవారును అశ్రాంతము ఋణమునుండి తొలఁగజాలరని యాఢి యగును. వర్షముయొక్క కొఱతకును, కరవులకు తఱచుగా బొల్పడు వ్యవసాయముఅప్పునుండి బారుగ విడివడజాలుననుట కల్ల. మానవులందు గొంద ఱైశ్వర్యవంతులును, కొందరు నిరుపేదలును నుండి కొందఱు సుఖింప మఱికొందఱు కష్టపడుట యేలనని ధనాధికారమున సర్వమానవసమత్వము నభిలషించు మహనీయుల మహత్తరోద్దేశము ఫలింపజాలనట్లే ప్రపంచమున కృషీవలులను బూర్తిగ ఋణరహితులనుగావింపవలెనను మహదుద్దేశముకూడ ఫలయుతము కానేరదని కొందఱి మనీషుల యభిప్రాయము. మానవుల ధనమంతయు నెల్లఱకు సమముగ పంచిబెట్టబడినను, పరీక్షణమునుండియు నందు వ్యత్యాసము గోచరించుచునే యుండును. నిరుపేదలట్లు ఋణగ్రస్తులుకూడ మానవకుటుంబమం దుండవలెనని కొంద ఱందురు.

వ్యవసాయబ్యాంకుల చరిత్రమును కొంత పరిశీలింతము. డిన్‌షాగారు సూచించిన ఈజిప్టుబ్యాంకు యుదంతమును పిదప యోజింతుము. ఈజిప్టుదేశమందేగాక యితర దేశములందు సేద్యబ్యాంకులు మిగుల నభివృద్ధి గాంచినవి. కాని యవి యభివృద్ధినందిన యేసీమనుండిగాని వ్యవసాయఋణము

పూర్తిగ నిర్మూలింపబడలేదు,—సహకారపరపతిసంఘములు తొలగింపబడనులేదు! జర్మనీదేశమందు కమతపుబ్యాంకులు చాల గలవు. నేల తనఖాపై నివి పైకము నప్పుగానొసగును. ఓహియో గవర్నలీబ్యాంకుల కార్యవిధానమును గమనించి, మిగుల నుగ్గడించెను. ఇవిగాక భూమి హామీలపై చవుక వడ్డీకి ఋణ మొసగు బ్యాంకులును, నేల నభివృద్ధిపఱచుటకై నప్పుల నిచ్చు నర్ధసంస్థలును, గృహనిర్మాణములకై సాయపడు బ్యాంకులును, సేవింగ్సుబ్యాంకులును, ఇన్ష్యురెన్సు సంస్థలును జర్మనీదేశమందు గలవు. ఈ సంస్థ లన్నియు గృషీవలులకు ప్రత్యేకసౌకర్యముల నొసగును. కమతముదారులకిట్టి సముపాయము లనవరతము గోచరించుచున్నను, ఋణగ్రహాలు వారి గృహములనుండు యదృశ్యము కాలేదు;—సహకారసంఘములు జర్మనీదేశమునుండి తొలగి పోలేదు! పల్లెసహకారము జర్మనీయందు పెంపొందినట్లే దేశమందును వృద్ధిఁ గాంచలేదు. 17000 ల కంటె నెక్కుడు సహకారసంఘములా సీమయందు తలలెత్తెను. "జర్మనీదేశమందు సామాన్యకృషీవలుల వ్యక్తి పరపతి (Personal credit) రైపిసిన్ సహకారబ్యాంకులందు గోచరించుచున్న" దని పోప్ అను నధ్యాపకుడు వ్రాక్రుచ్చెను.

జర్మనీయాష్ట్రియా దేశములందలి "రాష్ట్రబ్యాంకు"ల ప్రాముఖ్యతను ద్రోసిపుచ్చుట మా యుద్దేశము కాదు. ఈ బ్యాంకులు దొరతనమువారికి జెంది, లాభములను బడయు

నుద్దేశింపవు; సహకారసంస్థలతో పోటీగా నిలువక వాని కివి సాయపడును. సహకార బ్యాంకులు అల్పకాల పరిమితిగల పరపతి నొసగ "రాష్ట్రిబ్యాంకులు" తనఖాపరపతి లేక అధిక కాలపరిమితిగల పరపతిని చెడిన నేలను బాగొనరించుటకును, భూమి బలము నభివృద్ధి గావించుటకును నొసగును.

జర్మనీయాష్ట్రియాలందు వలెనే, ఫ్రాన్సుదేశమందు గూడ వ్యవసాయ బ్యాంకులతో బాటు సహకార సంఘము లభివృద్ధినొంది సహకారము యొక్క ముఖ్యప్రయోజనముల గొన్నింటిని ప్రపంచమునకు జూపెను. గవర్నమెంటు వారొసంగు విశేషధనసహాయము సహకార నిర్మాణమునకు భారవహమై యుండునుగాని సహాయకారిగా నుండజాలదని ఫ్రాన్సువలన మనము గ్రహింప జాలితిమి. ఫ్రాన్సుదేశమందు రెండువిధముల సహకార పరపతి బ్యాంకులు కలవు. మొదటి విధపు బ్యాంకులు దొరతనమువారికడనుండి సాహాయ్యము బడయుచుండ రెండవవిధపుబ్యాంకులు తమ మూలధనముపై నాధారపడియే కార్యక్రమము జరపుకొనును. దీనిలో రెండవ విధపుబ్యాంకులే మిగుల నభివృద్ధి జెందినవి. "విశేషముగా గవర్నమెంటు కావించిన తోడ్పాటే సహకారాభివృద్ధి కడ్డు నిలిచెనని హెర్రిక్ గారు వచించిరి. కృషీవలులకు వలయు రక్షణ మొరులనుండి చేకుఱజాలదని యిందువలన మన మూహింపవలెను.

ఇటలీలోగూడ వ్యవసాయబ్యాంకులు చాల యభివృద్ధి

జెందినవి. కాని యిటలీదేశమందే లుజ్జటీ వోలెమ్బర్గ్ లను మహానీయులు ఆ సీమపరిస్థితుల కనుకూలించునట్లు పల్లెపరపతిసంఘములను నెలకొల్పిరి. రైఫిసిక్ విధానము ననుసరించి సహకారబ్యాంకులు ఇటలీయందు 2000 కంటె నధికముగ నున్నవి. ఆష్ట్రియాహంగేరియాలోను, రష్యాలోను, రుమేనియాలోను, చెప్పనేల ప్రతి యైరోపాఖండసీమయందును వ్యవసాయబ్యాంకులును, సహకార సంస్థలును తోడ్తోడనే యభివృద్ధి నందుచున్నవి. వ్యవసాయబ్యాంకులు అభివృద్ధి నందుచున్న సమయమందే సహకారసంఘములు తలయెత్తి ప్రజల దృష్టి నాకర్షించినవి. జపానుదేశమందలి పరిస్థితులు భారతీయులచే ముఖ్యముగ గమనింపదగియున్నవి. జపానునందు వ్యవసాయబ్యాంకుల కెట్టి కొఱతయు లేదు. ఒక కేంద్రభూమి పరపతిబ్యాంకుకే కాకుండ 46 స్థానికబ్యాంకులును, సఘాలియన్, ఫర్మోసా, కొరియాపురములందు వ్యవసాయబ్యాంకులును కలవు. ఈ బ్యాంకులేవియు సహకారాభివృద్ధికడ్డు నిలువలేదు. ప్రాచీన సహకారపద్ధతులు చాలకాలము ప్రబలియుండెడివి. 1909 సంవత్సరమున జపాను ఐరోపావిధము ననుసరించి నూతన సహకారవిధము నవలంబించెను. మూడేండ్లలో నీ సహకారోద్యమ మత్యద్భుతమగు నభివృద్ధి నందెను. 1912 వ సంవత్సరమున 9,349 సహకారసంఘములును, పదివేల సభ్యులును, ముప్పయి సమ్మేళనములును పొడసూపినవి. పరపతి, ఫలవృద్ధి, క్రయము, విక్ర

యము అను నాలుగు తరగతుల సహకారసంఘము లిం దభి వృద్ధి గాంచుచున్నవి. పట్టుపండుప్రదేశములందలి మూడు విక్రయసంఘములందును 1914 వ సంవత్సరమందు 70,00,000 రూకల యమ్మకము జరిగెననిన, యీ సంఘములందు అద్భుతోన్నతి గ్రహింపనగును. "భారతదేశమందు సహకారోద్యమమును ప్రోత్సహింపదలచువారు జపానునందలి యుద్యమాభివృద్ధిని పరిశీలించు టావశ్యక" మని హేమిల్టన్‌గారు వచించిరి.

వ్యవసాయబ్యాంకులందు లభించుపైకము అప్పులు గావలసినవారి యక్కఱలను బూర్తిగ దీర్పజాలవనియు, నీ యక్కఱలను జేకూర్చుటకై వ్యవసాయేతరసంస్థ లవసరము లనియు పైన దెలిపిన విషయములవలన బోధపడును. పరిశ్రమల పోటీవలన వ్యవసాయబ్యాంకులకు వలసినంత మూలధనము చేరజాలదనికూడ మనము గ్రహింపవలెను.

ఇక సర్. డిన్‌షావాచాగారి ప్రశంస బడసిన ఈజిప్టు వ్యవసాయబ్యాంకుయొక్క యభివృద్ధి నించుక విమర్శింతుము. ఈ బ్యాంకువలన జూపట్టిన ప్రయోజనము మిగుల సామాన్యమైనదని ఈజిప్టుసూడానుల పాలనానివేదికలు తెలుపుచున్నవి. పరపతి యనుకూలములు చేకూర్చినకొలది, వినాశమునకు మార్గదర్శకములగు హెచ్చువడ్డీలకు ప్రజలు ఋణములు చేయు దురభ్యాసము తుదముట్టినగాని యీ భూమితనఖా బ్యాంకు విశేష లాభకారి యైనదని వక్కాణింపరాదని

1902 సంవత్సరమందలి ఈజిప్టు సూడాన్ నివేదిక తెలుపుచున్నది. "నూటికి పదిచొప్పున నీ బ్యాంకు నిర్దిష్టమొనరించిన వడ్డీరేటు మిగుల హెచ్చైన"దనియు, "ఆ రేటునకు స్థానికఋణదాతలకడనుండి యప్పుగొనుట సులభమనియు 1899వ సంవత్సరమునాఁటి నివేదిక తెలుపుచుండెను.

అప్పుగొనినవారు పైకమును వెచ్చించుతెఱగునుగమనింపకుండుట ఈజిప్టువ్యవసాయబ్యాంకునందలి లోపము. ఈ లోపముకతన బ్యాంకునుండి తీసికొనబడిన విత్తము చాలవఱకు దుర్వ్యయమునకుగుఱియాయెను. సహకారోద్యమవిధానమందే ఋణధనము నిష్ఫలక్రియలకై వెచ్చింపబడక ప్రయోజనయుతకార్యములందు వినియోగపడును. "ఈజిప్టువ్యవసాయ బ్యాంకునుండి వ్యయమగు ధనమంతయు నెందులకై వినియోగమగుచుండెను ? తఱచుగా నా ధనము యేదేని యుత్సవమందుగాని, సామరికపరిచర్య (Military Service) నుండి యెవండేని యువకుని తప్పించుటకుగాని, మఱి యేయన్యక్రియకుగాని వెచ్చింపబడుచుండెనుగాని సేద్యాభివృద్ధికై కాదు. అప్పుగొనిన పైకమును అధమర్ణులు దుర్వ్యయము చేయుచున్నందున, నిర్దిష్టసమయములందు వారు ఋణమును దీర్పజాలకుండిరి. ధనమును ప్రయోజనయుతక్రియలందే వ్యయమును గావించు నిబంధనము ననుసరించి ఋణ మొసగిన యెడల నిట్టి చెడుగురూపఱజాలును. కాని 250,000 సంఖ్య గలవారు ధనమును వెచ్చించువిధమును బ్యాంకు విమర్శింప

గలుగుట యసాధ్యము. బ్యాంకునకును, సేద్యకాండ్రకును నడుమ సహకారసంఘములు పనిచేయుచో కమతముదారు నకు ప్రయోజనములేని క్రియలందు దాతనికి ఋణము లొసగ వలయు కట్టుబాట్లు గావించి, యవి బ్యాంకును నష్టమునుండి కాపాడజాలును. సహకారసంఘమందలి సభ్యులు సమిష్టిగను, ప్రత్యేకముగను పూచీగలిగి, ఒకరినొకరెఱిగి, యొకరిక్రియల నొకరు పరిశీలించుచుందురు. గాన సత్క్రియలకే సముచిత వ్యయమై, కృషీవలు లార్థికాభివృద్ధినందఁ జాలుదు" రని రోమునగరపు పత్రిక యొకటి తెలుపుచున్నది.

వ్యవసాయపు బ్యాంకుమూలమున ఈజిప్టుదేశమందలి సేద్యకాని ఋణభారము తగ్గలేదు. కిచనర్ప్రభువు 1913 సంవత్సరమందు ఈజిప్టు పాలనానివేదికయందు ఆ సీమపల్లీ యుల దుర్భర ఋణభారమునుగుఱించి విపులముగ దెలిపె ననిన, అచటి కమతపుబ్యాంకువలన బ్రయోజన మెంతవఱకు చేకురెనో బోధపడును.

పల్లెవాసుల సౌకర్యములను జేకూర్చుటకు వేఱు ఉపా యమును యోజింపవలెనని ఈజిప్టునందలి దేశభక్తులు గుఱు తించిరి. 1910 సంవత్సరమందచట మొదటి సహకార సంఘము స్థాపింపబడెను. శాసనబల మేమియు లేకున్నను సహకారోద్యమ మచిరములో నభివృద్ధి గాంచెను. 1912 సంవత్సరమందు 9 సహకారసంఘములు ఈజిప్టునందు స్థాపింప బడినవి. బుద్ధిశాలియగు కిచనరుప్రభువు సహకారాభివృద్ధికై

యమూల్యములగు సలహాల నొసగి, ఉద్యమమును మిగుల ప్రోత్సహించెను. ఈజిప్టుయుద్యోగు లందఱుకూడ నీయుద్యమ ప్రాముఖ్యతను గుర్తించి, దాని యభివృద్ధికై మిగుల పాటు పడజొచ్చిరి. గవర్నమెంటు యప్పులతోడను, వ్యవసాయపు బ్యాంకులతోడను నీజిప్టుప్రజల యార్థికపరిస్థితులను బాగొనరింపఁ బ్రయత్నించి, వివిధమనోరథులై సహకారబ్యాంకుల మూలమునఁగాని తమ యుద్దేశము సిద్ధింపదని గుర్తించిరనిన సహకారోద్యమ మందిన విజయము అద్భుతమని యెల్లవారికిని విశద మగుచున్నది.

ఈజిప్టు వ్యవసాయబ్యాంకు ప్రజల కెనలేని మహోపకారము జేసినదని యంగీకరించినను, సర్ డిన్షావాచాగారి యుద్దేశము బలవత్తరము కాఁజాలదు. ధనవంతులగు భారతీయులు సాహసోపేతులై, వ్యక్తి సామర్థ్యప్రదర్శకంబులగు రాష్ట్రబ్యాంకులను స్థాపింపవలెనని యాతని యుద్దేశము. ఈజిప్టు కమతపుబ్యాంకు యన్ననో ప్రత్యేకవ్యక్తుల మూలధనముపైగాక గవర్నమెంటువారి యధికారసహాయములపై నాధారపడియున్నది. దొరతనమువారితో సన్నిహితసంబంధముగల నేషనల్ బ్యాంకున కిందు మూడవవంతు భాగములు (Shares) కలవు. ఇందు వ్యక్తి సామర్థ్యయున్నతులకు దావు లేదు. ఈజిప్టుబ్యాంకు యూరపువాసుల మూలధనముచే నెలకొలుపబడినది. వాచాగారు స్థానికధనముమూలమున స్థాపింపబడు రాష్ట్రబ్యాంకులపై దమ దృష్టులను నిక్షేపింప నుద్దే

శించుచుండిరి. పరిశీలింపగా నీ రెండు విధానములందును వ్యత్యాసము గోచరించుచున్నందున, నొక విధానముయొక్క భాగ్యోన్నతి ననుసరించి, రెండవవిధానముయొక్క పురోభివృద్ధి నూహింపఁబడజనదు.

వ్యవసాయపు బ్యాంకువలన గలుగు సదుపాయములు సహకారపరపతి విధానమందు గోచరించుచున్నవి. తమకు వలసిన విత్తమును సహకారసంస్థలు కేంద్ర రాష్ట్ర బ్యాంకుల మూలమున వెలుపలినుండి రాబట్టును. సహకార సెంట్రలు బ్యాంకులు అప్పొసగువానికి మంచి హామీ యీయజాలును. వ్యవసాయపు బ్యాంకులు గవర్నమెంటువారి పూచీకత్తుచే బలవత్తరములై యుండ సహకార సెంట్రలు బ్యాంకులు గవర్నమెంటువారి పూచీచే మాత్రమే గాక స్థానిక బ్యాంకుల యొక్కయు, వానియందలి సభ్యులయొక్కయు సమిష్టిబాధ్యతచే గూడ బలయుతములై యుండును. అప్పులినుండి పైకము నాకర్షించుటయేగాక సహకారబ్యాంకులు పొదుపుగుణమును పెంపొందించి, క్రొత్తమూలధనమును పుట్టించును. వ్యవసాయపుబ్యాంకులు ధనమును ఒకతావునుండి వేఱుచోటునకు మార్చుచుండ సహకారబ్యాంకులు కృషికులందు పొదుపు మొదలగు సద్గుణములను నెలకొల్పి నూతన మూలధనమును బుట్టించును. విత్తమును నిలువ వేయజాలుశక్తి నీ విధముగ నేద్యకాంండ్రయందు పెంపొందిపకున్నయెడల వ్యవసాయేతర మూలధనమును విశేషముగ వ్యవసాయక్రియలకై జరపినగాని

కృషికులను గ్రుంగదీయు ఋణభారము తగ్గనేరదు. ఈ ఋణ భారమును తగ్గించుటకు ఈజిప్టుదేశమునకు కంటె ఇండియాకు చాలపైకము అవసరమై యుండును.

బ్యాంకింగువిధానము వ్యాపించినకొలది వ్యవసాయ ఋణములు తగ్గిపోవుట తథ్యమే కాని విరివిగ బ్యాంకులను నెలకొల్పు టందలి కష్టములు చాల కలవు. విశేషముగ బ్యాంకులను స్థాపించుటకై యోచనయు సహనమును, కార్య తత్పరతయు, న్యాయమును యవసరము. తొందరతో వీనిని నెలకొలుపదలచిన జయము చేకూఱజాలదు. ఇట్టి బ్యాంకు లకు షాహుకారులు తమ సొకల సంచులను చేరవేయుదురని యాశపడుట యసమంజసము. సాధ్యమైనంతవఱకు స్థానిక సహకార బ్యాంకులును, యూనియనులును తమ ప్రత్యేక ప్రదేశములనుండి పైకము నాకర్షింపజాలును. విత్తము నిట్లు రాబట్టుకొనుటందు దూరమందు గల రాష్ట్రసంస్థలకంటె నీ స్థానికసంస్థలకే యెక్కుడు సదుపాయములు కలవు.

సహకారేతర వ్యవసాయ బ్యాంకులను ప్రతిఘటించు కొన్ని కష్టములను పరిశీలింతము. ప్రతిరాష్ట్రమందును భారత ధనాఢ్య లోక వ్యవసాయబ్యాంకును స్థాపింపవలెనని సర్ డిన్షాగారు వ్రాసిచ్చిరి. రాష్ట్రబ్యాంకులు పల్లీయులకు మిగుల దూరమందుండి ఋణములను గొనుట కెవరు తగు దురో ఏవిధానము లర్హములో గమనింపజాలనివై యుండును. పెద్ద జిల్లాలందు పనిచేయుచున్న సహకారబ్యాంకులు సహితము

యిట్టి యప్పాతోనప్పాలను పరిశీలింపజాలకపోయెనని రష్యా దేశమందలి సహకారసంస్థల చరిత్రమే తెలుపక తెలుపుచున్నది. విశాలప్రదేశములందలి బ్యాంకు లన్నిటియందును ఇట్టి లోపము గోచరించుచునే యున్నది.

భూమి యధికారమందును, ఈ యధికారమందలి పరిమితికాలములోను భారతదేశమం దనేక భేదము లుండుటచే వ్యవసాయబ్యాంకులను మార్పొకను కష్టము లధికముగ గోచరించుచున్నవి. హిందూదేశమందు కొన్నితావులలో భూమికంతకు కృషికు డధికారిగానుండును. మఱికొన్నిచోటులం దాతడు ఇంకొక భూమందు యదపుననుండి పనిచేయవలసి యుండును; మఱికొన్ని తావులందు పల్వురతో గలిసి యాతడు భూమిపై యధికారముగలవాడై యుండును. అందుచే వ్యవసాయబ్యాంకులొసగు ఋణముల హామీమొత్తములు వివిధస్థానములందు వివిధములై యుండును.

పన్నులను వసూలుచేయు వానిని వ్యవసాయబ్యాంకులొసగు ఋణములను ఋణములమీది వడ్డీలను రాబట్టుటకై నియోగింపవలెనని సర్. డిన్షాగారు వచించిరి. ఈవిధానము వలన గవర్నమెంటునకును, అప్పులకును సంబంధము కలుగుటయు, నీయప్పు వసూళ్లు తీఱులందు దొరతనమువారికి కళంకమాపాదించుటయు సంభవించును. ఈ ఋణములను వసూలుచేయుటందు ప్రజల యాస్తులనుబట్టి, ఒక్కొకపుడు జప్తుచేయవలసి వచ్చును. అనవరతము యిట్టి యిక్కట్టులకు లోనగు

కృషికులు యెట్టి యుత్కృష్టప్రయత్నమునకైన ననర్హులై యుందురు.

వ్యవసాయదారుల ఋణభారమును తగ్గించుటయేగాక, వ్యవసాయబ్యాంకుల కలవిగాని మహోపకారములను సహకారపరపతిసంస్థలు సేద్యమునకును, పరిశ్రమలకు జేకూర్ప జాలును. సాధారణ బ్యాంకులవలె గాక సహకారబ్యాంకులు సామాన్యవేతనములనే తమ యుద్యోగుల కొసగుచు, నితరులతో లాభములను పంచుకొనక మితవ్యయము సల్పుచు, తక్కువ వడ్డీకి ఋణముల నొసగును. ఈ బ్యాంకులు తమ సభ్యుల సౌకర్యమునకై రైపిసిన్ పరపతిసంఘము లట్లు సమిష్టి క్రయవిక్రయములను ఘలుపుచుండును. ఇట్లొనరించుటచే మధ్యవర్తులు లాభమును కబళింపజాలనివారగుటయు, లోకుధరలకే సభ్యులు పదార్థములను బడసి యనుకూలవిక్రయములను సలుపజాలుటయు దటస్థించును. ఈ క్రియలను నెఱవేర్చుకొనుటకై పరపతిసంఘము ఫ్రాన్సుదేశము నందలి సంస్థలవలె యితరసంఘములను స్థాపించుకొనఁ గలుగును. ప్రపంచమందలి, వివిధప్రదేశములందు గోచరించు పరిస్థితుల కనుకూలముగ వర్తించు శక్తియొక్క, సహకారమునకే కలదు. కేవలము కృషికులకేగాక, యితరులకుగూడ నవి యనేకవిధముల నుపకారియై యుండెను. సహకారముపై నాధారపడిన విక్రయసంఘములును, ఇన్స్యూరెన్సు సంఘములును, నీటివసతులఁ నేర్పఱుచు సంఘములును, పాలను ప్రజలకవలీలగ

సమకూర్చు సంఘములును, ఉద్యోగీయుల సంఘములును, పని వాండ్ర సంఘములును, అసంఖ్యాకములైన యితర సంఘములును గోచరించు టెల్లరికిని విదితమే. వివిధప్రజలకిట్లు వివిధ ప్రయోజనములను జేకూర్చుట వ్యవసాయ బ్యాంకుల కసాధ్యమని వేఱుగ దెలుప నక్కరలేదు.

సహకారమువలన జేకూఱు నైతిక రాజకీయ విద్యాభివృద్ధులు వ్యవసాయబ్యాంకులవలన గలుగజాలవు. నైతికాభివృద్ధియందు సహకారము కావించు మహోపకారము స్విట్జర్లాండునందు విశేషముగ గోచరించినది. ఆర్థికావశ్యము కతన సహకారపరపతి స్విట్జర్లాండులో దల యెత్తలేదు. తమంతకుతామే బేంకరులై ఒకరి బాధ్యత నొకరు వహించి కృషికు లభివృద్ధి నొందగలుగుటకై నైతికముగ సహకారము ప్రబోధించుటయే అది యట్లు తలయెత్తుటకు గారణము. ఒకప్పుడు హిందూదేశమునగల గ్రామసంస్థ లట్లు పరపతిసంఘము లభివృద్ధినంది దేశముయొక్క సత్పరిపాలనమునకై యువి యుపకరించునని కార్ మైకేలుగారు వచించిరి. జయయుతమైన గ్రామసంఘమందు విద్యయును, స్వపరిపాలనమునకు వలయు శిక్షణమును అభివృద్ధినొందునని పి. సి. లయన్ వంటి సుప్రసిద్ధపాలకుడు వాకొనెను. కేంద్రీకరణమును, సమ్మేళనమును రానురాను ప్రపంచ రాజకీయములందు మిగుల ప్రాముఖ్యము లగుననియు, స్థానిక, కేంద్రీకృత, రాష్ట్రసహకార సంఘములు ఇందులకు మిగుల దోడుపడుననియు నీరాజకీయ

వేత్తల యభిప్రాయము.

సహకారపరపతి నవీనమైనదని మనము తలపరాదు. రష్యా, దక్షిణ స్లావ్స్, క్రోట్స్, ఆష్ట్రియా, జపాన్, స్వీడన్, స్విట్జరులాండు లం దనేక శతాబ్దములనుండి సహకారపరపతి యభివృద్ధి నందుచున్నదని ఆ దేశచరిత్రలే తెలుపుచున్నవి.

ఈ విషయము లన్నిటిని గమనించిచూడ, నేఁడ్యకాంధ్ర ఋణభారమును తగ్గించుటకు వ్యవసాయబ్యాంకులు చాలునవి కావనియు, వీని దృష్టియందున్న యుద్దేశము సిద్ధించుటకు సహకారసంస్థ లవసరము లనియు తెల్లమగుచున్నది. సర్. డిన్షావాచాగారు సూచించిన బ్యాంకు ఈజిప్టుదేశమందలి వ్యవసాయబ్యాంకును బోలియుండదనియు, ఈజిప్టు బ్యాంకు పొందిన విజయము మన సీమయందుగూడ గోచరించునని తలపరాదనియు బోధపడుచున్నది. ఈజిప్టుప్రొరతనమువారుకూడ సహకారతత్వమందలి మహత్వమును గుర్తించి సహకారోద్యమమునకు జేయూత యొసగిరి. రాష్ట్రసహకారబ్యాంకులును, యూనియనులును కృషికి కులమునకై యవ్వలి పైకము నాకర్షించుచుండుటచే, మఱొకవిధపు రాష్ట్రబ్యాంకులను నెలకొలుపదలచుట యుక్తము కాదు. ఇంతియకాక ప్రస్తుతపరిస్థితులందును, పొదుపుగుణము నలవఱుచుకొనజాలని స్థితిలో ప్రజ లున్న సమయమందును, కృషికులను పీడించు ఋణమును దొలగింపజాలు విశాలమైన బ్యాంకింగు

విధానము నెగ్గునని తలపరాదు. ఆర్థికముగను, నైతికముగను, రాజకీయముగను, విద్యావిషయము నను సహకారసంస్థ లీయ జాలు ప్రయోజనములను వ్యవసాయబ్యాంకు లొసగజాలవు. సహకారేతరవ్యవసాయబ్యాంకులు, సహకార పరపతిసంస్థలు చేయు కృషికి దోడుపడవచ్చును గాని వానిని నిర్మూలింప జాలవని మనము దృఢముగ నమ్మవలెను.

# రెండవ యధ్యాయము

---

## సహకార ధాన్యపుబ్యాంకులు

సహకార ధాన్యపుబ్యాంకులను వ్యవసాయ సహకార పరపతిసంఘముల తరగతియందు జేర్పవచ్చును. పరపతిసంఘములు సొమ్మునకును, సొమ్మురూపమున నీయబడు ఋణములకును సంబంధముగలవై యుండ, ధాన్యపు బ్యాంకులు ధాన్యమునకును, ధాన్యమునకు సంబంధించిన బ్యాంకులకును సంబంధము గలిగియున్నవి. మన దేశమందలి ధాన్యపు బ్యాంకులకును జర్మనీదేశమందలి ధాన్యపుసంఘములకును చాల వ్యత్యాసమున్నది. ఈధాన్యపు సంఘములు :—

1. ధాన్యమును పరిశుభ్రపఱచి, యెండబెట్టి వివిధములుగను విక్రయార్హముగను చేయును;
2. ప్రజల యక్కఱ ననుసరించి—అనగా ప్రజలయందలి డిమాండునుబట్టి బజారునకు ధాన్యమును బంపును;
3. గాదులలోని ధాన్యమును హామీగానుంచి, సముచితమగు నిబంధనల ననుసరించి సేద్యకాండ్రు పరపతిని బడయుటకై తోడ్పడును;
4. మధ్యవర్తుల కగు వెచ్చమును, ఒకతావునుండి ధాన్యమును మఱొకచోటునకు సరకును మార్చుట కగు వ్యయమును తగ్గించును.

జర్మనీధాన్యపుసంఘములు సహకారవ్యవసాయవిక్రయ సంఘములను బోలియుండును గాని సహకారవ్యవసాయ పరపతిసంఘములను పోలియుండవు. మన దేశమందలి ధాన్యపు సంఘములు, పరపతి గలిగి ధాన్యపు బ్యాంకులై యుండును.

ధాన్యపుబ్యాంకుల యుద్దేశములు :

సర్కారున కీయవలయు పన్నును చెల్లించుటకును, ఋణదాత లగు షాహుకారుల యప్పులను తీర్చివేయుటకును, సేద్యకాండ్రు పంటధాన్యమును, అది తమ గాదులను చేరినతోడనే, తమ పేదరికమువలన నిచ్చివేయవలసివచ్చుట. ఈకారణముచే మఱుచటిసాలున ధాన్యము పండువరకు నీ వ్యవసాయదారుల చేతియందు చాలిన గింజలు లేకపోవుట. కుప్పనూర్చి వ్యవసాయదారులు ధాన్యమును గాదులందు చేర్చిన మూడు నాలుగు నెలలవఱకుగాని దాని ధర హెచ్చు కాదు. ధర యధికము కాకముందే వ్యవసాయదారులు ధాన్యమును వెచ్చింపవలసి వచ్చుటచే దానిమీద వచ్చు లాభము వర్తకులకే చెందునుగాని వారికి (వ్యవసాయదారులకు)గాదు. నిరుపేదలగు రైతులు తమయొద్దనున్న ధాన్యమును మే నెల ముగియులోపలనే వెచ్చింపవలసి వచ్చుటచే, మరల ధాన్యము పండువఱకు పొట్ట గడుపుకొనుటకై వారి షాహుకారులకడ నుండి హెచ్చువడ్డీలపై ధాన్యము నప్పుగా దీసికొనుచుందురు. ఈ కమతముదారులు తమ్ము ధాన్యమును తమ గాదులందు

మఱి మూఁడు నాలుగు నెలలు నిలువవేసికొనఁగలుగుచో, అను కూలమగు వేళయందు దానిని చాలభాగమును విక్రయించి, మరల ధాన్యము పండువఱకును చాలినన్ని గింజలను చేతి యం దుంచుకొనఁ గలుగుదురు. ధాన్యము తక్కువధరయం దున్నపుడు వ్యవసాయదారుల యక్కఱలను దీర్చి, అనుకూల సమయమందు దానిని విక్రయించుటకు దగు సాధనమును వారికిఁ గనపఱచుటకును, విత్తులు జల్లుటకును, పోషణమున కును, ఎక్కువ వడ్డీకి దెచ్చిన ధాన్యపుఋణములను దీర్చుట కును, కరవుసమయములందు నిరుపేదలకు దోడుపడుటకు ధాన్యమును నిల్వవేయుటకును నీ బ్యాంకు లేర్పడినవి.

ధాన్యపుబ్యాంకుయొక్క కార్యవిధానము :

పంటకాలమందు సంఘము స్థాపింపబడవలెను. సంఘ మందు సభ్యుఁడుగా జేరదలచిన ప్రతి మనుజుఁడును ప్రవేశరుసు ముగా గొంత పైకమును చెల్లింపవలెను. సంఘమును పాలింప వలయు నధికారము సంఘీయుల సాధారణసభకు జెంది యుండును. ఈసాధారణసభయొక్క యజమాయిషీకి లోబడు పాలనాసంఘ మొకటి (Committee of Management) సంఘమునకు సంబంధించిన విషయముల నన్నింటిని పరిశీ లించుచుండును. ఈ సంఘము తన సంఘీయులలో నొక్కరుని కార్యదర్శిగ నియోగించును. ఈ కార్యదర్శి గమనింపవలసిన విధు లేమనిన:

(1) లెఖ్ఖలనన్నిటిని పరిశీలించి, కమిటీయొక్క ప్రతిసమావేశమందును వానిని సంఘీయులకు చూపుట.

(2) కమిటీయొక్క యాజ్ఞ ననుసరించి ధాన్యమును పడసి, యవసరమగువారి కొసగుట. ఇట్టి యానలేనిదే యాతడు ధాన్యము నెవ్వరికిని నొసగరాదు.

(౩) ధాన్యపుగాదెయొక్క తాళము చెవిని తనయొద్ద నుంచుకొని రెండవబీగమును కమిటీకడ నుంచుట.

సంస్థయొక్క పని జరుగుటకై, పాలనాసంఘము ధాన్యపువిరాళముల నాహ్వానించి, సంస్థతరఫున ధాన్యము నప్పుజేసి, నిల్వకై ధాన్యమును రాబట్టుచుండును. ఒక్కొకపుడు పాలనాసంఘము ధనము నప్పుగా గొని, ఆ పైకముతో ధాన్యమును గొనును. సంఘాభివృద్ధికై సాధారణసభవారి యాజ్ఞ ననుసరించి ప్రతి సభ్యుడును కొంత ధాన్యమును ధాన్యపుబ్యాంకున కొసగవలెను; యిట్టి ధాన్యముపై కొంత రేటును సాధారణసభవారు నిర్దిష్ట మొనరింతురు. వివాహసమయములందును, సంతానము కలిగినపుడును, శ్రాద్ధసమయములందును ప్రతిసభ్యుడును కొంతపైకమునుగాని ధాన్యమునుగాని ధాన్యపుబ్యాంకునకై యొసగుట నముచితము. ధనము లభించినపు డది ప్రవేశరుసుములకు జేర్చబడవలెను; లేక ధాన్యముగా మార్చబడవలెను.

వంగదేశమందలి ధాన్యపు బ్యాంకులు:

భారతదేశమందు మొదటి ధాన్యపుబ్యాంకు వంగదేశమందలి దినాజ్‌పూర్ జిల్లాయందు రాయ్ పార్వతీశంకర్ చౌదరీగారిచే 1892 సంవత్సరమున స్థాపింపబడినది. ప్రతి రైతుకడనుండియు ఎకరమునకు 10 సేరుల చొప్పున ధాన్యమునుగాని ఆ పరిమాణము గలధాన్యముయొక్క మూల్యమునుగాని యీ బ్యాంకు రాబట్టుటకై నిశ్చయించినది.

పల్లెయందలి పెద్దలందఱు నీప్రయత్నముపట్ల తమ సానుభూతిని దెల్పిరి; తోడనే యొక పంచాయతి యేర్పఱుపబడెను; ధనమునుగాని ధాన్యమునుగాని విరాళముగా నీయదలచు మహానీయుల పేరులు జాబితాలుగా వ్రాయబడెను. 105 రూకల విలువగల 80 మణుగుల ధాన్యమును కొని స్థాపనకర్త యొక గాదెయందు నిలువచేసెను. తొలుత నిది సహకారోద్దేశము ననుసరించి నెలకొలుపబడలేదు. ఈ సంస్థకు సంబంధించిన పల్లెలందలి ప్రజలకు అనుకూలమగు వడ్డీకిది కొంతధాన్యమును అప్పుగా నీయదొడగెను. కాలక్రమమున మూలధనమును, వడ్డీలును అధికమైన కొలది, ఈసంస్థ బలవత్తరమైనది. 1914 సంవత్సరము డిశంబరు వఱకు నిది రిజిష్టరుకాని సహకారసంఘముగా పనిచేసి, పదంపడి స్థాపకుని యుద్దేశానుసారము సహకారసంఘశాసనము ననుసరించి రిజిష్టరు చేయబడినది. కరవుచేతను, పేదరికము చేతను పెక్కు యిక్కట్టులబడు రైతునకు సాహాయ్యము

చేయజాలు సామర్థ్యమును 80 మణుగుల ధాన్యముచే నెల కొలుపబడిన చిన్నిసంస్థ యెట్లు పడసినది. 1915 సంవత్సరము మార్చినెల యందలి దీని లెఖ్ఖలను పరిశీలించిన బోధపడును:

| | | రూ. అ. పై. |
|---|---|---|
| చేతియందలి పైకము | | 973— 5—0 |
| అప్పుగా నొసగబడిన 2737 మణుగుల $7\frac{1}{2}$ సేరులధ్యాము | ... | 6158—10—9 |
| పదార్థరూపమందలి వడ్డీ 181 మణుగుల $36\frac{1}{4}$ సేరులు | ... | 409— 4—$7\frac{1}{2}$ |
| రాబట్టవలయు పైకపు ధరావతులు | ... | 231—15—0 |
| | | 7773— 3—$4\frac{1}{2}$ |

ఈసంస్థయందు గోచరించిన లాభము స్థాపనాకర్తను 1900 సంవత్సరము మార్చి మాసమందు, మంచిపంట పండిన సమయమందు డక్కా జిల్లాయందలి షెయిట్‌గర్‌టియొటా, రహట్‌పూర్‌ పూరులలో నిట్టిబ్యాంకుల రెండింటిని స్థాపింప బురికొల్పెను. ఈ పల్లెలందలి ప్రజలు కొలదిమంది మాత్రమే యీ యుద్యమము వలన లాభముల నూహించి కొంత ధాన్యమును తమ వంతులుగ నీబ్యాంకుల కొసగిరి. ఈ బ్యాంకులందు నిలువయైన ధాన్యము మిగుల స్వల్పముగా నుండెను. కాని, షెయిట్‌గర్‌టియొటా యందలి ప్రజలు 1901, 1902 సంవత్సరములందు అచటి బ్యాంకు చూపిన ప్రయోజనమును గుర్తించి దానికి (అది పుట్టిన మూడవయేట)

గొంతధాన్యము నొసగిరి. బ్యాంకు నెలకొలుప బడినపుడు గల 50 మణుగులు ఆ జేండ్లలో 182 మణుగులుగా వృద్ధిపొందెను. ఇట్టి సహకారధాన్యపుబ్యాంకులే బంకూరాజిల్లాయందు బనాసురియా, టల్ డంగ్రాలలో రెండు స్థాపింపబడెను. టల్ డంగ్రాయందలి ధాన్యపుబ్యాంకు 1903 సంవత్సరము డిశంబరు 14 వ తేదీనాడు బంకూరా కలక్టరుగా రొసగిన 50 రూకల విరాళముల మూలముననను, 21 మణుగుల ధాన్యపు నిల్వల వలనను, నెలకొలుపబడినది. బర్ద్వాన్ మహారాజాసీమ యందలి టల్ డంగ్రా, టాన్ టిడంగా లను గ్రామములు రెండును ఈ బ్యాంకుయొక్క సంబంధమును బడసినవి. స్థాపింపబడిన కొలది కాలములోనే టల్ డంగ్రా సంఘము ధాన్యపు అప్పులను 20% చొప్పునను, పైకపుఋణములను 12% చొప్పునను నీయ మొదలిడెను. ఈ యప్పులు కేవలము బ్యాంకు సభ్యులకు మాత్రమే యొసగబడు చుండెడివి—యీసభ్యుల సంఖ్య 26. ఈసంఘము 1906 సంవత్సరము డిశంబరు నెల యందు రిజిష్టరు చేయబడెను. ఒకేపరి యిది రెండుపనులకు గడగుటచే, చిక్కు లనేకములు సంభవించినవి; సంఘమందలి యుద్యోగులకు సరియగు లెఖ్ఖలను తయారుచేయుట కష్టమాయెను! అందుచే నీ సంస్థను కేవలము ధాన్యపుబ్యాంకుగా గాని, అర్థసంఘముగా గాని, నడపుటకు నిశ్చయింపబడెను. ఈనిర్ధారణము ననుసరించి యిది కేవల మర్థసంఘముగా నేర్పడెను.

బనాసురియా ధాన్యపుసంఘ మింతకంటె నధికాభివృద్ధి నందెను. కేవలము ఇరువదియారు సభ్యులతో నిది 1906 సంవత్సరము ఏప్రియల్ నెలలో నెలకొలుపబడెను. సభ్యులచే నొసగబడిన ప్రవేశరుసుము 16½ మణుగుల ధాన్యమునకు, ఇంతకుముర్పు చందాలుగా చేరిన పైకమందు 50 రూకలను కలక్టరు చేర్చెను. ఈపైకముతో వరి కొనబడెను. ఇట్లు సంఘమందుగూడిన ధాన్యమును సంఘీయులకు అప్పులుగా నొసగబడుచు వచ్చెను. ఈసంఘము 1907 సంవర్సరము ఏప్రియల్ నెలలో రిజిష్టరు చేయబడెను. ప్రతి నూతనసభ్యునికడనుండియు ప్రవేశరుసుముగా 20 సేరుల ధాన్యము తీసికొనబడెను. తీసికొనిన అప్పులు సరిగ నిర్దిష్టసమయమందే తిరిగి చెల్లింపబడుచు వచ్చెను. ప్రతిసంవత్సరము జూలై నెలలో ఋణము లొసగబడుచుండ, వడ్డీతో నాపైకము జనవరి మాసమందు చెల్లింపబడుచుండెడిది. ఈసంఘము తన సొంతగాదెను 1914 సంవత్సరమందు నిర్మించుకొనెను. 20% చొప్పున (నూటికి 25 చొప్పున) వడ్డీ నిర్ణయింపబడెను. 1923 వ సంవరమందీ సంఘమున నూరుగురు సభ్యులు చూపట్టిరి. క్రియావిధానమునకు వలయు మూలధాన్యము 60 మణుగులు సంఘీయులకు చేకూరెను.

ఇట్టి ప్రయత్నములే వంగదేశమందలి మిడ్నాపూరు జిల్లాయందు చేయబడెను. ఈవిధముగనే బొంబాయి రాజధాని యందును, బీహారు ఒరిస్సా రాష్ట్రమందును అనేక

సంఘములు స్థాపింపబడెను. ఈసంఘములు మార్చి, సెప్టెంబరు మాసముల లోపున ఆహారమునకై ధాన్యము నొసగి, తరువాతిపంట వేళయందు 25% చొప్పున వరియాపముగనే రాబట్టుకొనుచుండును. ఈసంఘములకు సంబంధించిన నిబంధనములును, లెఖ్ఖలును మిగుల సూక్ష్మములైనవి. వీని ధాన్యము గోతులందు భద్రపఱుప బడుచుండును. ఇట్లొనరించుటకు విశేషవ్యయముగాని శ్రమగాని కలుగునది కాదు.

ధాన్యపుబ్యాంకు వలని ప్రయోజనములు:

(1) గ్రామమున కొక్కొక ధాన్యపుబ్యాంకు గ్రామ వరివసతులనుండియే యవలీలగ నిర్మింపబడవచ్చును.

(2) ప్రతి సభ్యుడును బ్యాంకున కీయవలయు ధాన్యము సాలుపంటలయందలి కొంతభాగమే యగుటచే, దాని నొసగుట వానికి కష్టముగా తోచదు.

(3) బ్యాంకు యధికారికాక పంచాయతీయుద్యోగులందఱు జీతము లేనివారై యుండుటచే, బ్యాంకున కగు వ్యయము అల్పమై యుండును. బ్యాంకుపాలనమును కనిపెట్టుటకై సమర్థులగువారు పల్లెయందనవరతము గోచరించుచునేయుందురు.

(4) సొమ్ము బ్యాంకునందువలెగాక, సంఘీయుడిచ్చ వచ్చిన తెఱగున అధికనుగు అప్పులను చేయుట కీ బ్యాంకునందు సాధ్యములేదు.

(5) బ్యాంకుగాదెయందు ధాన్యము నిండినవంతనే క్రొత్తధాన్యమునకు ప్రాతధాన్యము మార్చబడును. ఇట్లొనరించుటవలన లాభము చేకూరుటయు, క్రొత్తబియ్యమును గొనుటవలన వచ్చు వ్యాధులను దప్పించుటయు గలుగుచుండును.

(6) అవసరమగువేళయందు వ్యవసాయదారులకు ఈ సంస్థ ఆహారమునకై ధాన్యము నొసగుచుండుటచే, హీనక్రయములకు గింజల నమ్మవలసిన దుర్గతినుండి కాపులు కాపొంది అనుకూలసమయమందే తమ వరి నమ్ముకొని సముచితమగు లాభముల నందజాలుదురు.

(7) బ్యాంకుగాదెయందు పల్లీయు లందఱికిని హక్కుయుండుటచే, దానియందలి ధాన్యము నమ్ముటకే యొక్కరునకు అధికారము లేకుండుటచే, అనవరతము కొంత నిల్వ వరి కన్పట్టుచుండును.

(8) కరవు వచ్చునపుడు నిరుపేదలను రక్షించుభారము నుండి ఈ ధాన్యపుబ్యాంకు జమీందారులను, దొరతనము వారినిగూడ దప్పించుటచే నిది కేవలము కృషికులకేగాక, ధనాధికులకును, అధికారులకునుగూడ మిగుల ప్రయోజనకారియైనదని వక్కాణింపవలెను.

(9) పల్లీయులే ఈ యుద్యమమునకు శంకుస్థాపన మొనరించి, పంచాయతులను నియోగించుటచే, ఉద్యమాభి

వృద్ధికై వారు శక్తివంచనలేక ప్రయత్నించుచుందురు. ఎల్లరి కృషి బడసియు నీ సంస్థ క్రమక్రమముగ బలయుతమై, చిర స్థాయిగ నుండజాలును.

(10) రైలుప్రయాణమునకుగాని, స్టీమరుప్రయాణము నకుగాని సౌకర్యములేని ప్రదేశములకు కాటకపుసమయము లందు ధాన్యము నందజేయుట మిగుల కష్టమై యుండును. ధాన్యపుబ్యాంకు ఎట్టి యరిష్టమందైన నిరుపేదలను గాపాడు చుండునుగాన పయనవసతులులేని కష్టమువలని నష్టమునకు వారిని గురి గాకుండ జేయును.

మూడవ యధ్యాయము



# వ్యవసాయేతర సంస్థలు లేక నాగరిక పరపతి సహకారసంఘములు

వ్యవసాయేతర పరపతి సహకారసంఘముల స్థాపనమునకు వలయువసతులు :

వ్యవసాయేతర పరపతిసంఘములను స్థాపింపవలసిన యక్కఱ భారతదేశమందు సహకారోద్యమము తలయెత్తక ముందే గుఱుతింపబడెను. సహకారోద్యమ సంస్థాపనమునకై 1901 సంవత్సరమున సమావేశమైన కమిటీ (సంఘము) నివేదికయం దిట్లు వ్రాసెను :—

"కేవలము వ్యవసాయదారులకే యుపకరించు సంఘములను స్థాపించుటకుమాత్రమే దొరతనమువారు తమ ప్రోత్సాహము జూపరాదు. ఇటలీలోని సహకారబ్యాంకులు తొలుత పట్టణములందే నెలకొలుపబడినవి. ఈబ్యాంకులందు గోచరించిన ఫలితముల నుపలక్షించి, సహకారవిధానానుసారమున మన పట్టణములందుగూడ సంఘములను స్థాపించు టవసరము. ఈ సంఘములవలన గలుగుప్రయోజనములు రెండు. సాధారణోద్యోగులును, పనివాండ్రును చిన్న మొత్తములను నిలువవేసికొనుటకు పోస్టాఫీసు సేవింగ్సుబ్యాంకుకంటె నివి యెక్కు డనుకూలము జూపి వారియందు పొదుపుగుణమును

పెంపొందించును. ఇటలీదేశమందు నగరబ్యాంకులు గ్రామ బ్యాంకులకు వలయు పైకము నవ్వాగా నొసగుచుండ, మన దేశమందుగూడ నీ పట్టణసంస్థలు పల్లెసంఘములకు అక్కఱ వచ్చువేళలందు దోడ్పడజాలును.”

1904 సంవత్సరమున నిర్మింపబడిన సహకారపరపతి సంఘశాసనము పైన నుల్లేఖించిన కమిటీవారి సిఫారసుల ననుసరించియే పుట్టి వ్యవసాయ నాగరకసంఘముల యక్క ఱను గుర్తించెను. వ్యవసాయసంఘమం దైదుగురకు నల్వురు చొప్పున సేద్యకాండ్రును, రెండవదానియం దట్లనే (ఐదుగు రకు నల్వురుచొప్పున కమతముదారులు కానివారును ఉండ వలెను. అందుచే సహకారోద్యమము భారతసీమయందు దల యెత్తిననాటనుండి, వ్యవసాయ పరపతిసహకారముతోబాటు, వ్యవసాయేతర పరపతిసహకారముగూడ నభివృద్ధి జెందవలె నని గవర్నమెంటువా రుద్దేశించిరి. అయినను హిందూదేశ మున సహకారోద్యమమును బురికొల్పినది వ్యవసాయము నభివృద్ధి గావింపవలెనను నుద్దేశమే యగుటచే, వ్యవసాయ, వ్యవసాయేతరసంస్థలు సమముగా వృద్ధిజెందలేదు. 1909-20 సంవత్సరమందు భరతఖండమున 32,595 సంఖ్యగల వ్యవ సాయపరపతిసంఘము లుండ, వ్యవసాయేతరపరపతిసంఘములు 1405 మాత్రమే యుండెను.

వ్యవసాయేతర పరపతిసంఘములను దేశమం దంత టను విరివిగా స్థాపింపవలసిన యవసర మాసన్నమైనది. “పట్ట

ణములందు వసించుచు పరిశ్రమజీవనము సలుపువారొనగు వడ్డీ, సేద్యకాండ్రిచ్చు వడ్డీకంటె తక్కువయైనదికాదు. ధరలు అధికమైనకొలది, ఇండ్లు కట్టుకొనుటకు ఆరోగ్యప్రదమై చాలినంతతావు దొరకకపోవుటచే కలుగు చిక్కులు పెరుగుకొలది, కచేరులనుండియు, కర్మాగారములనుండియు రావలసిన అల్పవేతనములు సరియగుసమయమందు చేతికి జేరకుండుటచే గలుగు యిబ్బందు లధికమగుకొలది, విద్యాభివృద్ధి ననుసరించి, యున్నతజీవనము గడుపవలె ననుకోరిక మిన్నయగుకొలది, దైనిక పారిశ్రమజీవనమునందు యిక్కట్టులు గోచరించినకొలది, సర్వారిష్టహారియు, సర్వసౌఖ్యసంధాయకంబును నగు సహకారోద్యమము సర్వజనాదరార్హంబై యుండును. కేవలము వ్యవసాయసంఘములనే నభివృద్ధిపఱచి, యితరసంఘముల దెస నుపేక్షాదృష్టులను పఱపితిమేని, అర్థమునకువలయు నక్కఱయు, నీ యక్కఱను దీర్చివేయుటయు సాలుపోదుగునను దేశమందు సమముగ విభజనము కాకపోవుటయు, సంవత్సరమందు కొన్ని నెలలలో సెంట్రలు బ్యాంకులు తమ మూలధనమును ప్రయోజనయుతముగ వెచ్చింపజాలనివిగ నుండుటయు తటస్థించును. నగరమందు వసించువారలకు ముఖ్యముగ పరిశ్రమజీవనము సలుపుచు న్యాయస్థానములందుమాత్రము గవర్నమెంటు యుద్యోగులనుజూచు పట్టణవాసులకు దొరతనమువారితో నేశాఖలోనైన సంపర్కము గలుగజేసితిమేని, చాల లాభములు కలు

గును. అందుచే వ్యవసాయేతరులందుఁగూడ సహకారమునకు తావల మొసగి, సముచితముగ దానిని నడపుట మిగుల సమంజసము" (మెక్లాగన్ కమిటీవారి నివేదిక)

వ్యవసాయేతర పరపతిసంఘము లిపుడు ప్రతిరాష్ట్రము లోను గోచరించుచున్నవి; వీని మొత్తపుసంఖ్య 1405; వీనియందు సగముకంటె నెక్కుడుసంఘములు పరిమితిలేని పూచీ కలవి (Unlimited type) ఈ సంఘములందు అవలంబింపవలసిన పూచీనిగుఱించి మక్లాగన్‌కమిటీవారు యిట్లు వచించిరి. "బ్యాంకునకు సంబంధించిన సభ్యులు ధనాఢ్యులైనపుడును, స్థానికపరిస్థితులనుబట్టి సంఘీయు లొకరినొకరెఱుగుట సాధ్యము కానపుడును, బ్యాంకునందలి భాగధనము బ్యాంకు కార్యవిధానమునకు జాలినపుడును పూచీపరిమితి గలిగియుండవలెను. యిట్లు కానిచో నది పరిమితి లేనిదై యుండవలెను. వ్యవసాయసంఘములందుకంటె వీనియందు అధికమైన జాగ్రత జూపవలెనని సెంట్రలు బ్యాంకులు గుర్తింపవలెను." వీనియందలి సభ్యులు ఒకచో నుండక అచటచట వసించుచు, ఒక్కొకపుడు స్థానాంతరముల కరుగుదురు గావున వీరినుండి ఋణధనమును రాబట్ట జాలుట మిగుల కష్టమగును. ఈ సంఘపరిస్థితులు కేవలము కార్యవిధానముదెసనే సంఘీయుల దృక్కుల నాకర్షించును గాని, అందుచే సహకారవిజయమునకు ప్రధానమైన నైతిక తత్వ ముపేక్షింపబడుచుండవచ్చును. ఈ సంఘములకు సంబం

ధించిన లెక్కలు సాధారణసభ్యునకు బోధపడనివిధమున మిగుల కఠినమై యుండును. ఈ విషయములందు వీనియం దిట్టి చిక్కులు గోచరించుచున్నను, పల్లెసంఘములందు జూపట్టజాలని మేళ్లిందు దోచును. వీనియందలి సభ్యులలో చాలమంది చదువుకొనినవారై యుందురు. సంఘపాలనమును, లెక్కవిమర్శనమును నే నెరసు లేక సరియైయుండును; నిల్వపైకము లధికమగుట సాధ్యమై యుండును; తక్కువ కాలములో చెల్లింపవలయు ఋణము లవలీలగ సభ్యులకడ నుండి నెలవారిగ బ్యాంకును చేరజాలును.

భారతదేశమందు వివిధప్రదేశములలో వివిధములైన పట్టణసంఘములు ఉద్భవించినవి. వీనియందు ముఖ్యమైన మూడువిధములనుగూర్చి మాత్రము మేమిందు దెలుపుదుము.

(1) సాధారణ అదాయము కలవారికై యేర్పడిన పట్టణ బ్యాంకులు;
(2) మాసవేతనములందు వారికై స్థాపింపబడిన సంఘములు;
(3) నిరుపేదలకై నెలకొలుపబడిన సంఘములు.

## సామాన్యులకై నెలకొలుపబడిన బ్యాంకులు:

ముఖ్యమైన మొత్తమునకు వీని భాగములు (షేరులు) నిర్దిష్టమై, పరిమితిగల పూచీ గలిగియుండును. తమకు సంబం

ధించిన భాగస్థుల (Shareholders) తోడనేకాక, ఇతరు లతోగూడ నివి సాధారణబ్యాంకింగుపనిని జరపుచుండును. ఒకేపట్టణమందు వసించువారినే యివి సభ్యులుగా జేర్చుకొనును. సాధారణ జాయంటుస్టాక్ బ్యాంకులను పోలియుండి, సహకారనిబంధనములనుండి యివి తఱచుగా దొలగిపోవుచుండును. లాభమొత్తములకై (Dividends) మాత్రమే తఱచుగా వీనియందలి షేరులు తీసికొనబడును. ఊహావాణిజ్యవ్యాపారులకై వీనినుండి యూహాపరులు ఋణములను దీసికొనుచుందురు. సహకారమును పెంపొందించుటందుగాక, వీని ప్రాముఖ్యత జాయంటుస్టాక్ బ్యాంకింగునందు వీనియందలి సభ్యులకు శిక్షణ మొసగుటందు గోచరించును. సహకారసంఘ శాసనానుసారము వీని గుణములనుబట్టి వీనిని రిజిష్టరుచేయుట యంత యుచితముగా దోపకున్నను, జాయంటుస్టాక్ బ్యాంకింగువలని సౌకర్యములు చూపట్టని తావులందవి మిగుల ప్రయోజనకరములై యుండునని మక్లాగన్ కమిటీవారు వచించిరి. "కేవలము నామమాత్రపు కిదవున బ్యాంకింగు సంస్థలను నెలకొల్పినందువలన గలుగు అపాయములు ఉత్తర హిందూస్థానమున నిటీవల స్పష్టముగ గోచరించిన అనుభవము వలన దెలియుచునేయున్నవి. కాని పట్టణమందలి ప్రజలకు సాధారణ బ్యాంకింగు నియమములను బోధించుటకివి మిగుల నుపకరించును.........జాయంటుస్టాక్ బ్యాంకింగు సౌకర్యములు లేనిచోటులందవి మిగుల ప్రయోజనకారులై యుండు"

నని ఆ కమిటీసభ్యులు వాకొనిరి. పట్టణబ్యాంకులు మన నగరము లందును, సాధారణపట్టణములందును అర్థమును లాభప్రద కార్యవిధానమున కుపయోగపఱచుచు, కృషిక కులమునకు పల్లె పరపతిసంఘములు మహోపకారము చేయు లీల నగరమున వసించు వర్తకునకును, పరిశ్రమజీవనము సలుపు సామాన్యమానవునకును నెనలేని యుపకారము చేయును. నగరములందు పెద్దపెద్ద జాయింటుస్టాక్ బ్యాంకులు లేనందున, భారతసీమయందవి విశేషముగ దలయెత్తదొడగెను. "అనేక ప్రదేశములం దిట్టి సంఘములు గాంచిన విజయము మిగుల నద్భుతమైనది. బొంబాయిరాజధానియందలి దక్షిణమధ్యమ భాగములందు జాయింటుస్టాక్ బ్యాంకులు బొత్తుగా లేనందున, నిరుపేద లగు పనివాండ్రును, సాధారణవిత్తము నార్జించువారును సముచితమగు వడ్డీకి ఋణములను పడయుటకును, భద్రముగ తాము చిన్నమొత్తములను నిలువవేసికొనజాలుటకై తగుసంస్థలను గన్గొనుటకును మిగుల కష్టపడుచున్నా" రని బొంబాయి రిజిస్ట్రారుగారు వచించిరి.

## వేతనము లందువారికై స్థాపింపబడిన సంఘములు

వ్యవసాయసహకారసంఘములను మిగుల సవలీలగా స్థాపింపవచ్చును; ఏలనన్న నీసంఘములందు సభ్యులుగా జేరు

వారు తాము తీసికొను పైకమునకు హామీగా నొసగుటకు భూములను, గృహములను, పశువులను గలిగియుందురు. అంతియకాక వీనియందలి సంఘీయు లందఱొకే పల్లెయందు వసించుచుండుటచే ఒకరినొకరు బాగుగ నెఱిగి పరిమితిలేని పూచీ కందఱు బాధ్యులగుట కంగీకరింతురు. పట్టణములందు వసించువారిలో కొలది మందికిమాత్రము స్థిరాస్తి యుండును; జనసంఖ్య యధికముగ నుండుటచే నొకరికొకరు పరిచితులై యుండజాలరు. అందుచే నగరములందు నెలకొలుపబడు సహకారసంఘములు సాధారణముగా పరిమితిగల పూచీతోను, భాగధనము (Share-Capital) తోను స్థాపింపబడును. తాము నిలువ వేసికొనిన పైకమునుండి కొంత భాగమును సభ్యులు భాగధనముగా తమ సంఘమున కొసగుదురు. ఈ భాగధనముయొక్క బలమునే హామీగా జేసి సంఘము ప్రజలకడనుండి నిల్వమొత్తములను రాబట్టును. ఉద్యోగులును, చేతిపనులం దాఱితేఱినవారును, చిన్నవర్తకులును, ఒకటి రెండు పేరులను కొనుటకు సమర్థులై యుందురు గాన వారి కిట్టి సంఘములు కడు ననుకూలములుగా నుండును. కాని చిన్నదుకాణములందును, రైల్వేలందును, పనిచేయువారలును, గవర్నమెంటు వారి యధీనమున నుండు సామాన్యోద్యోగులును తాము పడయు జీతముతో నెట్టెట్టులో పొట్ట పోసికొనుచు పైకమును నిలువవేసికొను సామర్థ్యములేనివా రగుటచే నీ సంఘములు వారికి దోడ్పడునవిగా లేవు. ఒక సామాన్యోద్యోగి

కుటుంబఖర్చులు పోను నెలకు ఒక రూకగాని రెండురూకలు గాని నిల్వవేసికొనగలుగునెడల, సహకారసంఘమందలి పది రూకల విలువగల షేరునుగొనుట కాతనికి చాల సమయము పట్టును.

తాను గొను అప్పునకు హామీగా నొసగుటకు తన స్వల్పవేతనమును ఉద్యోగమందు దాను నిలిచియుండు నాసయు తప్ప మఱేమియు లేనివాడగుటచే, జిన్నియుద్యోగి పైకము నందుటకు మిగుల కష్టపడవలెను. ఉద్యోగచ్యుతము గాని, మరణముగాని ఆతని నేసమయమందైన మూలగొనును. ఒక తావునుండి మఱొకచోటునకు ఉద్యోగి బదిలీయగుచో, అనుకూలమగు న్యాయస్థానమునమూలమున నాతనికడనుండి యప్పును రాబట్టుట ఋణదాతకు మిగుల కఠినమైయుండును. ఈ చిక్కులన్నియు కండ్లకు గట్టినట్లుండ వాని కప్పీయదలచువా రెవ్వరైన, హెచ్చువడ్డీకే యీయ సాహసింతురు. అందటివలెనే యీయుద్యోగి యౌషధవ్యయమునకును, వివాహములకును, శ్రాద్ధక్రియలకును ఋణము చేయవలసియుండును. కాని, తన సదుపాయము పడయుటకై, యెల్లఱికంటె నీతడధికముగ వ్యయ మొనరింపవలెను. ఒకమా ఱాతడు ఋణముచేసినయెడల, ఆ యప్పునుండి విడివడజాలుటయు, మరల నప్పుబడయుటయు కడు కఠినమగును. ఇక నిల్వపైకము మాటందుమా, దుకాణములందు పనిచేయువారలకు ప్రావిడెంటు ఫండు (Provident Fund) సౌకర్యము గాని పైకమును

గూడబెట్టుటకు మ తేసదుపాయముగాని యుండదు. నెలకు బహుకష్టమున నాతడు నిల్వవేసికొనజాలు రూకపై బ్యాంకు జుగుప్సాగర్భితమగు దృష్టిని సారించును. అనగా ఆ చిన్ని మొత్తమును నిల్వకై తీసికొనుటకే బ్యాంకును యిష్టపడదు. పైకమును నిల్వకై తీసికొను నిశ్చితబ్యాంకు విధానమేమియు లేనిచో, అల్పముగనైన గొంత మొత్తమును కూడబెట్టవలె నను నభిలాష యెవ్వరికిని గలుగదు.

ఈ విషయము లన్నియు, వేతనముపడయు నుద్యోగు లకై యేర్పడు సహకారపరపతిసంఘముల ప్రత్యేకరూపము నకు గారణములై యున్నవి. ఇట్టి సంఘము పొదుపుపై నా ధారపడి యుండవలెను; ఫలనన నెట్టిపరపతికైన పొదుపే మూలబంధము! సంఘముయొక్క భాగధనము (Share Capital) నకై ప్రతిసభ్యుడును మాసమాసము కొంత పైక ము నిల్వచేయవలెను! షేరు ఒక్కంటికి నెలకు రూకకు తక్కువగాక కొంతసొమ్మును కట్టవలె నను నిబంధనమును, కట్టుబాటును వంగదేశమందుఁ గలవు. బొంబాయిలో నొక సంఘముయొక్క యుపనిబంధనములయందు, సంఘవిధాన మిట్లు వర్ణింపబడెను:—

ఈ దిగువ వివరించిన రేట్లచొప్పున నెలచందా ప్రతి సభ్యుడును సంఘమునకు చెల్లింపవలెను:

| జీతము | చందా |
|---|---|
| రూ 1 మొదలు 15 వఱకు | రూ 0–8–0 |

| | | | | |
|---|---|---|---|---|
| రూ | 16 మొదలు | 40 వఱకు | రూ | 1—0—0 |
| ,, | 41 ,, | 80 ,, | ,, | 3—0—0 |
| ,, | 80 ,, | 100 ,, | ,, | 4—0—0 |

.........(ఇట్లే యని మెఱుగునది)............

చెల్లించిన ప్రతి చందామొత్తమునకు సభ్యుడొక యచ్చు రసీదును పడయును. పదిరూకల విలువగల టిక్కట్లు పడసినంతనే వాని నాతడు కార్యదర్శికి జూపుచో, వాని నన్నిటిని రద్దుపఱచి, వానికి బదులుగా నాతడు 10 రూకల విలువగల పేరున నొక సర్టిఫికేటు యిచ్చును. ఈ సర్టిఫికేటు పై నాటి తేదీ యుండును; దీనిపై రావలసిన డివిడెండు మొదటిచందా చెల్లింపబడిన తారీఖునుండి లెక్కింపబడును. చందా టిక్కట్లు విలువ 10 రూకలైనపిదప, సభ్యుడిచ్ఛగించుచో వానిని సంఘమున కీయవలయు బాకీ తీర్చుటకై యుపయోగింపవచ్చును."

పైన నుదహరించిన విధముబోలు సంఘముయొక్క యక్కఱ గుఱుతింపబడినంతనే, సంఘసంస్థాపకులు కొందఱు చేరి సంఘవిధానమును గుఱించి చర్చింపవలెను. వేతనము నందు వారిపై సాధారణప్రజలపైకంటె నెక్కుడు యజమాయిషీ చూపి కచేరీయధికారులలో నౌకరిద్దఱిని, కమిటీసంఘములోని కాహ్వానింపవలెను. సంఘముకే వాణిజ్యసంస్థకు గాని, శాఖకుగాని సంబంధించియున్నపు డిట్టి యేర్పాటు

గావించుట ముఖ్యము. తమ యధికారికి సంఘముతో సంబంధ మున్నదని యెఱిగిన సంఘీయులు అప్రమత్తులై ప్రవర్తింతురు. ఈ యధికారులు తమ యధీనపు టుద్యోగులతో సమముగ నెన్నికలకు నిలువ నిష్టపడరు; అయినను సంఘమునకు వారిబలము చేకూర్చుటకు వలయు ఉపనిబంధనములను నిర్మింపవలెను. ఒక్కొకప్పుడు సంఘము తనకు సంఘీయుల నుండి రావలసిన బాకీమొత్తములను వారి జీతములనుండి వారి యంగీకారము బడసి రాబట్టుకొనవచ్చును. ఈ యేర్పాటువలన సాధారణముగ సంఘము నష్టము పాలుగాకుండును. ఈ యేర్పాటు ఒకప్పుడు సాధ్యము కానియెడల, సంఘీయులైన యుద్యోగులపై యధికారి పైకమును వారికడనుండి తన యధికారబలమున రాబట్టి సంఘమునకు దోడుపడును. ఉద్యోగాధికారుల సాహాయ్యము పడసినవెనుక, మాననీయులగు నలువది యుద్యోగులను సంఘమందు జేర్చుకొని సంఘపాలకులు పేరులు తీసికొనునట్లు వారిని ప్రోత్సహింపవలెను. ఋణములు దీర్చుభారము తనపై వహించునెడల దొలుతొలుత సంఘమునకు చాల ధన మవసరమై యుండును. పరపతిగా నిలుచుటకు చాలినంత భాగ ధనము సంఘమందు జెల్లింపబడియుండుచో నీయర్థ మవ్వలినుండి చేకూఱగలదు. అందుచే 5 మొదలు 10 పేరులవఱకు దీసికొనజాలు ధనాఢ్యులబలము సంఘమునకు సమకూడుట ముఖ్యము. సాధారణ సభ్యులను జేర్చుకొనునపుడు సంఘము మిగుల మెలకువతో

ప్రవర్తింపవలెను; ఏలనన నిట్టి సంఘీయులు నిరుపేదలై, న్యాయమును, పొదుపును మాత్రము హామీగా జూపగల వారై యుందురు. సంఘమునకు సంబంధించిన ఉద్యోగులు అచ్చటచట చెదరియుండుచో వారివలన రావలయు చందా మొత్తములు తిన్నగ సంఘముయొక్క కచేరిని చేరుటకు దగు సౌకర్యము లున్నవో లేవో యనియు, అట్టి సౌకర్యము లులేని తఱి యామొత్తములను రాబట్టుటకై ఉపసంఘము లను నియోగింపవలెనో యనియు సంఘాధికారులు విచారింప వలెను. సంఘసంస్థాపకు లందఱు తొలిసమావేశమున నీ విష యము లన్నియు విపులముగా జర్చించి, సంఘముయొక్క యుపనిబంధనములందు వలయు మార్పులను గావింపవలెను.

ఉద్యోగీయులకై యేర్పడు సహకార సంఘములు కొన్ని చిక్కులకు గుఱియగుచున్నవి. తఱచుగా నీ యుద్యో గులు ఒకచోటునుండి మఱొకచోటునకు బదిలీ చేయబడుచుం దురు. కమిటీసమావేశములందు సభ్యులందఱు సమానులుగా గలిసికొనజాలరు. ఒకే సంఘమందలి సభ్యులైనను, ఉద్యోగ మందలి యున్నతపదవులకు దగు గౌరవవిశ్వాసములందు సంఘీయులు తమ యక్కఱకొఱకును, తమ మిత్రులకొఱకును నెక్కుడు మొత్తములను బడయజాలుదురు. సంఘీయుడైనను గాకపోయినను, ఒక కచేరి యధికారి సంఘమును తనిఖీ చేయుచో సంఘము యభివృద్ధిలోనికి రాగలదు. పైకమును సంఘీయుల జీతములనుండి రాబట్టుకొనుటకు సంఘముయొక్క

యుపనిబంధనములందు మార్పులు కావింపవలెను. ఈవిధాన మవలంబించుచో సంఘీయులు హాదుపుగుణ మలవఱుచుకొని, బలయుతమైన హామీకలవారై యుందురు. ఎవరుగాని సంఘమందు సభ్యుడుగా జేరుటకు, పోస్టాఫీసు ఇన్ష్యూరెన్సు ఫండులో ఇన్ష్యూరు చేసికొనవలె నను నిబంధనము నమలుపఱచుచో సంఘస్థితి యనుకూలమై యుండును.

ఉద్యోగీయుల సహకారపరపతిసంఘములు రైల్వేఆఫీసులందును, వాణిజ్యసంస్థలందును, గవర్నమెంటు కచేరులందును పనిచేయువారియం దధికముగా నుత్పన్న మగుచున్నవి. ఒక కలకత్తాలోనే యిట్టి సంఘములు నలువదికంటె నెక్కుడుగ గలవు. ఈస్టు యిండియన్ రైల్వే యుద్యోగుల సంఘము, బెంగాల్ నాగపూర్ రైల్వే యుద్యోగుల పట్టణబ్యాంకు, పోస్టల్ సహకారపరపతిసంఘము, ఈస్టరన్ బెంగాల్ రైల్వే యుద్యోగులసంఘము, కలకత్తా కార్పరేషన్ సహకారపరపతిసంఘము, ట్రెజరీబిల్డింగ్స్ సహకారసంఘమును వీనిలో ముఖ్యములు. వీనిలో గొన్నిసంఘములందలి సభ్యుల సంఖ్య వేయికంటె నధికముగాను, మూలధనము లక్షరూకలకంటె నెక్కుడుగాను నుండెను. 1921 సంవత్సరము జూన్ 30 వ తేదీయందు కలకత్తాలో 33 అర్బన్ బ్యాంకు లుండెను. వీని యందలి సభ్యుల సంఖ్య 23,000 ; యిందలి కార్యవిధానమునకై చేకూర్పబడిన పైకము 33 లక్షల రూకలు; యిందు 11 లక్షల రూకలు భాగధనము వలనను, మఱి పదునొకండులక్షల

సాకలు సభ్యులొసగిన నిల్వ మొత్తముల వలనను, $1\frac{1}{2}$ లక్షలు రిజర్వుఫండు వల్లను, $9\frac{1}{2}$ లక్షలు ప్రజలొసగిన నిల్వ మొత్తముల వలనను సమకూడెను. ఈసంఖ్య లిట్టి సంఘముల యభివృద్ధిని దెలుపక తెలుపుచున్నవి. కాలక్రమమున వీని ననుసరించి సహకారస్టోర్సు సంఘము లుత్పన్నమాయెను.

కలకత్తాయందలి అర్బన్ బ్యాంకులకు విశేషముగ ధనము చేరుచుండుటచే నా నగరమందు సెంట్రల్ అర్బన్ బ్యాంకును స్థాపింపవలసిన యక్కఱ లేకపోయెను. కాని వర్తకము కొండొకవడి క్రుంగిపోవుట వలనను, జీవననిర్వహణమునకు వ్యయ మధికమగుటచేతను, బ్యాంకులను చేరు నిల్వ మొత్తముల సంఖ్య తగ్గిపోయెను. అందుచే నా నగరమందు సెంట్రల్ బ్యాంకును స్థాపింపవలయు నక్కఱ దోచెను. కాని, యీక్రొత్త బ్యాంకును స్థాపించుటకు బదులు నగరమందలి అర్బన్ బ్యాంకులను బెంగాలురాష్ట్రీ సహకారసమ్మేళనమున కనుబంధించు టుచితము. ఇట్లొనరించుటకు బెంగాలురాష్ట్రీ సమ్మేళన యుపనిబంధనములందుఁ దగు మార్పులు చేయుటవసరము.

బొంబాయిలో గూడ నుద్యోగీయుల సంఘములు పెక్కులు కలవు; వీనిలో గ్రేట్, యిన్‌డియన్ పినిన్‌సులా రైల్వే ఉద్యోగీయుల సంఘమును, బొంబాయి, బరోడా, మధ్య యిండియా రైల్వే సహకారసంఘములు మిగుల పెద్దవి. వీనియందు మొదటిదాన్ని యందు 5,733 గురు సభ్యులును,

4,24,750 రూకల పైకమును, రెండవదానియందు 4,074 గురు సభ్యులును, 2,11,645 రూకల ధనమును నుండెను. సభ్యుల కడనుండి రావలయు ఋణమొత్తము వారి జీతమునుండి తీసి కొనబడును. బొంబాయిలోని సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీసు సంఘమందు 204 గురు సభ్యులును, 13,980 రూకల ధనమును నుండెను. కొలది సంవత్సరములకు మున్ను రిజిష్టరు కాబడిన బొంబాయి పోస్టల్ సంఘమునందు 400 మంది సభ్యులును, పదివేలరూకల మించిన పైకమును నుండెను. ఈసంఘములను నడపు ఉన్నతోద్యోగుల శ్రద్ధవలన నివి క్రమక్రమాభివృద్ధి నందినవి.

బీహారు ఒరిస్సాలయందిట్టి సంఘముల సంఖ్య క్రమ క్రమముగ వృద్ధిజెందసాగెను. 1921 సంవత్సరాంతమున 48 సంఘము లీరాష్ట్రమున జూపట్టినవి; వీనియందలి సభ్యుల సంఖ్య 5,518; పైకముయొక్క మొత్తము 3,50,418 రూకలు; యీరూకలందు రు 1,63,885 లు చెల్లింపబడిన భాగధనము. చెన్నపురి రాజధానిలోను, సంయుక్తపరగణాలలోను, పంజా బులోను, ఉద్యోగీయుల సంఘములు క్రమక్రమాభివృద్ధి నందు చున్నవి. పాంచాలమందలి ఉత్తర-పశ్చిమ రైల్వే సంఘ మందు 2000 మంది సభ్యులును, లక్షున్నరరూకల మూలధన మును నుండెను.

ఈ యుద్యోగీయుల సంఘములందు ఋణములు ఫల యుతముకాని పనులకై అనగా పెండ్లిండ్లకును, శ్రాద్ధక్రియల

కును, ప్రాతయప్పులు దీర్చుటకును, వైద్యఖర్చులకును, నొసగ బడును. వీని యందలి సంఘీయులు విద్యావంతులై, సహ కార నిబంధనములను గ్రహించువా రగుటచే, నీ సంఘములు సాధారణముగా విజయమునే యందుచున్నవి. దైనికజీవన మున కవసరమగు వస్తువులను కొనుటకును, అమ్ముటకును దగు కృషి జేయుటకు వీనిలో గొన్నిసంఘము లుద్దేశించు చున్నవి. ఇట్టి సంఘక్రియా సమ్మేళనము ప్రోత్సహింపదగినది కాదు. కాని సంఘీయులందఱు దమకు గావలసిన యక్కఱల నన్నిటిని గుఱుతించి, దినచర్యయందు గావలయు పదార్థ ముల నొక్కమాఱుగా కొనుట మిగుల లాభకరము. వీని యందలి లెక్కలు ప్రత్యేకముగా నుండవలెను. పరపతిసం ఘము క్రయములకు పూచీకత్తు నీయరాదని ప్రతి సభ్యుడును గుర్తింపవలెను.

## నిరుపేదలకై యేర్పడిన సంఘములు

బండ్లుతోలువారును, తాపీపనివాండ్రును, ఫ్యాక్టరీలలో పనిచేయువారును, ఇంటింటను బనిచేయు పరిచారకులును, పాకీవాండ్రును మిగుల నిరుపేదలై, ఋణభారము క్రింద క్రుంగిపోవుచున్నారు. వీరి ఋణమును తగ్గించుటకై వీరి యందు సహకారము నెలకొలువ నిశ్చయించిన భారతసేవా సంఘీయుల (The Servants of India Society, Poona) యొక్కయు, బొంబాయిలో ఋణమును దీర్చుటకై యేర్పడిన

సంఘము (Debt Redemption Committee) యొక్కయు ప్రయత్నములు కడుంగడు ఫలము నందినవి. పైన దెలిపిన నిరుపేదల పరిస్థితులను బాగుగ పరిశీలించి, వారి యార్థికస్థితి యభివృద్ధినందినగాని వారికి ముక్తి లేదని భారత సంఘీయము లూహించి, 1913 సంవత్సరమందు వీరికై మూడుసంఘములు స్థాపించిరి. రెండేండ్ల ఆఱుమాసములలో 14 సహకారసంఘములు తల యెత్తినవి. ఒకే చోటునందు—అనగా నిరుగు పొరుగులందు వసించువారును, ఒకే జాతికిగాని లేక నొకే వృత్తికిగాని జెందినవారును మాత్రము సంఘములందు సభ్యులగుట కర్హతబడసిరి. ఒకటిగాని, అంతకంటె నెక్కుడు నేవులకు పైకమును దఫదఫాలుగా సంఘీయులు చెల్లించుటకును, సంఘములందు ప్రతిమాసము కొంత ధనమును నిలువవేసి కొనుటకును, ప్రోత్సాహింపబడిరి. సంఘములలో సంపర్కము లేని యితర ప్రజలకడనుండి యప్పును నిల్వపైకములను రాబట్టి, ఆయర్థమూలమున సంఘములు సభ్యుల ప్రాతయప్పులను దీర్చివేయ గడంగెను. పొదుపునుగుఱించియు, త్రాగుడు దుర్వ్యయములాది దుర్గుణములవలన నాపాదించు మహాకష్టములను గుఱించియు, సహకారఫలితములను గుఱించియు నుపన్యాసముల నిచ్చు నేర్పాటునీ సంఘములు కావించెను. జీతములందు ఇన్‌స్పెక్టరు లీసంఘములందు జరుగు కార్యక్రమమును పరిశీలించుచు వచ్చిరి. సంఘవిధానమునకు సాహాయ్యము సలుపుటకై దొరతనమువారు మూడేండ్లవఱకు సాలునకు

ఐదువందల రూకల నొసగిరి. 14 సంఘములందును గల సభ్యులసంఖ్య 400 లాయెను; దామాషాయుని ఒక్కొక్కని ఋణము మున్నూరు రూకలై యుండెను; ఋణదాత లగు షావుకారుల కీయవలయు పైకము నీ సంఘీయులలో పల్వురు చెల్లించివైచిరి. షావుకారులకు వా రీయవలయు రు 1,10,000 ల ఋణమును, ఋణదాతల సమ్మతిపై రు 87,944 లుగా తగ్గింపబడి సహకారసంఘములకు షావుకారులనుండి బదిలీచేయబడెను. తోడ్తోడనే వెలకు రూపాయకు అణాచొప్పునగల వడ్డీ పైసవఱకు తగ్గింపబడెను. ప్రాతయప్పులను దీర్చుటకు సంఘములు రు 87,944 ల నొసగినవి; యీ పైకమందు రు 40,083 లను సభ్యులు రెండేండ్ల ఆఱు మాసములలో తీర్చివైచిరి. ఈ సంఘములు ఋణభారమును సగమువఱకు తగ్గించుకొనినవి. మిగిలిన యప్పుపై మిగుల నల్పమైన వడ్డీమాత్రము చెల్లించుచున్నవి. తమ ప్రాతయప్పులను దీర్చుకొనుటకై సంఘములనుండి ఋణముగొన్న సంఘీయులు తమజీవితములను ఇన్స్యూర్ చేసికొనిరి. వ్యాధిగ్రస్తులకు ఔషధము లొసగి, సేవచేయుటకై యొక సహకార చికిత్సాలయము నెలకొలుపబడినది; విద్యాభివృద్ధికై నైశపాఠశాలలు స్థాపింపబడినవి. కలకత్తా, హౌరాలను బోలు మహానగరములందు ఫేక్టరీలందు మిగుల శ్రమపడుచు, మ్యునిసిపాలిటీలం దల్పవేతనము లందుచు పేదఱిక మనుభవించుచు కాబూలీ, మార్వాడీల కప్పుపడి, వారి దాస్యము

నకు గుఱియగుచుండు పనివాండ్రను గాపాడుటకై నగరములు బొంబాయి చూపిన దృష్టాంతరము ననుకరించు టుచితము.

చెన్నరాజధానియందుగూడ నీ సంఘముల యక్కఱ గుఱుతింపబడెను; మన రాష్ట్రమందు నిమ్నజాతులవారికై మూడు జిల్లాలందు 250 సంఘములు స్థాపింపబడినవి. 1920–21 సంవత్సరాంతమునకు ప్రత్యేకముగ పాకీవాండ్రకై 48 సంఘములు నెలకొలుపబడినవి. ఈ సంఘముల పాలనమున నాయాప్రదేశములందలి మ్యునిసిపలుసభ్యులును, మ్యునిసిపలు యధ్యక్షులును బాల్గొని నిమ్నజాత్యుద్భవులకు సదుపాయములను సమకూర్ప దొడగిరి.

ఇట్టి సంఘములు నిరుపేదలకు మిగుల ప్రయోజనకారులని పైన నుదహరించిన వృత్తాంతమువలన బోధపడుచున్నది. కాని, వీనిని నెలకొల్పుటకు ప్రజాసేవా తత్పరుడగు మహనీయుడుగాని, దృష్టిసమత్వమున నున్నతాదర్శముల నిడికొను సాంఘికసంస్థగాని పూనుకొనవలెను. ఇట్లు పూనువారు కాలక్రమమున తమ యుద్దేశము చరితార్థమందుట గాంచి పరితోషచిత్తులు కాజాలుదురు; ఏలనన సంఘీయులుగా జేరు నిరుపేదలు నిష్కల్మష చిత్తులై, శ్రద్ధాళువులై, సహకారనియమములను నేర్చికొని స్వీయాభివృద్ధినంద బాటుపడుదురు. అంతియకాక వీరు న్యాయశీలురై నిర్దిష్టసమయములందు బాకీమొత్తములను జెల్లించివైతురు. "సంఘమం దున్నతస్థానము నాక్రమించిన విద్యాధికుడు ఇం

చుకతోడుపడినయెడల న్యాయప్రవర్తనమును, ఆత్మగౌరవము నలవఱుచుకొని వీరు స్వీయపురోభివృద్ధి నందుదు" రని యు బాంకుగారు వాక్రుచ్చిరి. ఈ సంఘములందు సభ్యులగువారు నిరుపేదలై, విద్యాగంధ మెఱుగనివారగుటచే తమంత తాము తగు శిక్షణము లేనిదే వారు తమ పనులను నెరవేర్చుకొనజాలరు. అందుచే ప్రజాభ్యుదయమునకై పాటుపడు సంస్థలకు సాహాయ్యము చేయునట్లే దొరతనమువారిట్టి సంఘములకు విరాళముల మూలమున దోడ్పడి, సమర్థులగు వారిని సంఘకార్యవిధానమును నెరవేర్చుటకై నియోగించుట సమంజసము.

నాలుగవ యధ్యాయము



# సహకారము, వ్యవసాయము.

విశేషవిస్తీర్ణములేని భూఖండములును, అస్వల్పమూల ధనమును, అల్పగృహ పరిశ్రమలును మాత్రము మన దేశమందు గానవచ్చుచున్నవి. గృహపరిశ్రమల నభివృద్ధిపఱచుట యందు సహకారముయొక్క ప్రయోజనమును దెలుపుటకు ముందు, వ్యవసాయము నభివృద్ధిజేయుటయందు దాని యుపయోగమును విమర్శించుదము. పూర్వమునుండియు వ్యవసాయము భారతీయులలో పల్వురకు ప్రధానవృత్తియై యుండెను. భారతకృషీవలులను బాధించు ఋణభారమును గురించి చర్చించుచు, అది తొలగుటకును వ్యవసాయ మభివృద్ధియగుటకును సహకారము తోడ్పడు విధానమును గూర్చి వెనుకటి పుటలలో దెలిపితిమి. కాని భారతదేశమున సేద్యమున కడ్డు నిలచునది కేవలము ఋణమే కాదనియు, రైతుయొక్క యజ్ఞానమనియు గూడ మనము గుర్తింపవలెను.

విద్యలేనిదే ప్రజ లాదర్శవిహీనులై, యభివృద్ధిమార్గముల నెఱుగక పురాతన పద్ధతుల ననుసరించియే వ్యవసాయము చేయుచుందురు. ప్రపంచమందు విజ్ఞాన మభివృద్ధిజెందుచుండ, నాగరికత ముందంజవేయుచుండ, తనకు గాదను

నట్లాతేడు చేతులు ముడుచుకొని కూరుచుని యుండును. గవర్నమెంటువారి వ్యవసాయ భూఖండములందును, సహకారసంఘములకు సంబంధించిన ప్రదేశములందును, వ్యవసాయాభివృద్ధికై చూపబడిన నూతనవిధానములను క్రొత్తయెరువులు తయారగు చొప్పును, నవీనసేద్యపరికరములను జూచినంతనే, అట్టి పద్ధతులను తమ పొలములం దవలంబింప కృషీవలు లాతురపడుచుండిరి. కాని, వారి యవిద్యయు, పూర్వాచారపరాయణత్వమును, విరుద్ధభావములును, నూతనవిధానమును, క్రొత్తపద్ధతులను, నవీనపరికరణములను, క్రొత్తవిత్తులును వారిచే నాలస్యముగ నవలంబింపజేయును. విద్యాయూలోక మించుకంతైన నంధకారబంధురములై యున్న వారి హృదయకుహరములందు ప్రవేశించిన యెడల, నూతన భావముల నవలీలగ నలవఱచుకొని సేద్యకాండ్రు క్రొత్తపరికరముల నవలంబించి యుందురు. వ్యవసాయదారుల పిల్లలు క్రొత్త వ్యవసాయ పద్ధతులను అవలీలగను, విశేషవ్యయము లేకుండను, నేర్చుకొనుటకు దగు నేర్పాటులను గావింప బెంగాలు దొరతనమువారు నిశ్చయించిరి.

కృషిక బాలకులకై యేర్పడు పాఠశాలలు, కమతముదారుల కనతిదూరములో నిర్దిష్టమైన కొందఱు విద్యార్థుల కుపకరించు రీతిని స్థాపింపబడవలెను. వీనికగు వ్యయము మిక్కిలి తక్కువదై యుండవలెను. ఈపాఠశాలలందలి శిక్షా కాలము రెండు సంవత్సరములై యుండవలెను. క్రియావిధాన

మందే బాలురకు విశేషశిక్షణ మొసగుచుండవలెను: కాని ప్రైమరీ పాఠశాలలో విద్యార్థులు నేర్చికొనిన విషయము లను మఱువకుండుటకై చదువునందును, వ్రాతయందునుగూడ వారిని తర్ఫీతు చేయునవలెను: కాని యిందలి విద్యార్థులు చదువవలసిన పుస్తకములు కేవలము వ్యవసాయమునకే సంబంధించియుండి, సేద్యవృత్తాంతమం దాఱితేఱిన వ్యవసా యోద్యోగిచే రచింపబడవలెను. ఆరోగ్యనిబంధనలును, భూమి కొలత విధానమును, వడ్రంగిపని చేయు నేర్పును, కమ్మరివాని కృషియు—చెప్పనేల సేద్యకాని కనుదినము కావలయు పదా ర్థములను స్వంతదాను చేసికొనదగుటకై సముచితమగు పాఠ ప్రణాళిక యీ విద్యాలయములం దేర్పాటు చేయవలెను. ఆరోగ్యనిబంధనలు, సహకారపరపతి, వ్యవసాయాభివృద్ధి- మున్నగు వానిని గుఱించి వీనియందలి విద్యార్థు లవలీలగ నేర్చుకొనుటకు దగు విధము నవలంబింపబడవలెను. లేంటరన్ బొమ్మల మూలమునను, పఠముల వలనను నిట్టి శిక్షణము సుబోధకమగును. ఈశిక్షణము దైనికవ్యవసాయ జీవనమున కాలక్రమమున వారి కుపయోగపడవలెను.

ప్రతి పాఠశాలకు గొంతభూమి యంటి యుండవలెను. విద్యార్థులా భూఖండమందు సేద్యవిధానముల నభ్యసింప వలెను. తొలియేట బాలకులంద ఱొకే భూమిపై కృషిచేయ ను: రెండవయేట ప్రత్యేక భూభాగములపై నెవరికి వారు ంతము పనులను నేరవేర్చుకొనవలెను. ఈకృషి యట్లుండ

విద్యార్థులు తమ పాఠశాల భవనమునకేమైన మరమ్మతులను చేయుచు, విద్యాలయప్రాంగణము నతిశుభ్రముగ నుంచవలెను. శృంగారజీవనము దేశ బాలురదృష్టి నిక్షేపింప కుండుటకై యుపాధ్యాయులు తగు కట్టుబాట్లు చేయవలెను; కూర్చుండుటకు చాపలు మాత్రము వారికి సప్లయి చేయబడవలెను. ప్రతిపాఠశాల ప్రధానోపాధ్యాయుడు, పిల్లలతో గలిసి పొలమునందు నూతనసేద్యవిధానములను నిరూపింపవలెను. ఇట్లొనరించినచో పరిసరమున వసించు పల్లీయులాతావునకు పోయి క్రొత్త వ్యవసాయపరికరముల యొక్క యుపయోగము కన్నులెదుట గాంచియు, కమతమును గురించిన యుపన్యాసములను వినియు దమకు గల సందియములను ప్రధానోపాధ్యాయు నడిగి నివారించుకొనుచు చాల లాభము నందుదురు. ఒక్కొక్క పాఠశాల సమీపమ్మున నున్న కతిపయ గ్రామములకు శిక్షణాస్థానమై యుండును.

పాఠశాలయందు ప్రవేశింపదలచు ప్రతి విద్యార్థియు ప్రయిమరీ తరగతియం దాటితేటి యుండవలెను. ప్రతి విద్యార్థియు 13 లేక 14 యేండ్ల వయసుగలిగి తగు శరీరదార్ఢ్యము కలిగి యుండవలెను. వయసు విషయమై యిట్టి నియమమున్నను, సాధారణముగా వ్యవసాయదారుల పిల్లలు తొలుదొలుతనే పొలములందు ప్రవేశించి వ్రాయను, చదువను సకాలమున నేర్చుకొనరు గావున 13 లేక 14 యేండ్లుమించిన వారు నూతనవ్యవసాయవిధానముల నెరుగుటకై పాఠశాల

యందుఁ దగు యేర్పాటులు కావింపవలెను. కమ్మత్తమును గుఱించిన సులభవిషయములు రెండేండ్లకాలము విద్యార్థుల పఠనాప్రణాళిగా నిర్దిష్టము కావలెను. కాని భారతకృషీవలుడు తన తనయులను రెండేండ్లవఱకు పాఠశాలయందు నిలువుచేయుట కిష్టపడడు గావున దొలియేటనే వలయు వ్యవసాయవిషయములను విపులముగా బోధకులు బాలురకు దెలుపవలయును. విశేషవ్యయమునకు లోబడక, తాము నేర్చుకొనిన విషయములను విద్యార్థిజీవనము ముగియగానే బాలకులు తమతమ పొలములందు క్రియారూపమున వినియోగించి, నవీనవ్యవసాయపద్ధతుల వలని ప్రయోజనములను గృషిక సంతతికి ప్రత్యక్షముగ జూపవలెను. పాఠశాల లందలి రెండవయేటి పఠనాప్రణాళిక తొలియేటి దానికంటె నించుక కఠినమై క్షారగాయములను, ఔషధములను పెంచుటందును, పొగాకు పదును వేయుటందును, చుట్టలు చుట్టుటందును, వెన్న చేయుటందును విద్యార్థులను దరిఫీదు చేయుచుండును. సేద్యమం దున్నతినందజూచు వారికి వలయు శిక్షణమంతయు నీ రెండవయేటఁ గలుపబడును.

ఈ విద్యావిధానము మిగుల ప్రశంసనీయమైనది. ఇది కార్యరూపమున పరిణతమైనచో, భారత దేశమున సేద్యము తానురాను మహోన్నతస్థితి నందును కాని యీ విధానము మిగుల కఠినమగుటచే దీనిని నెరవేర్చుటకు ప్రత్యేకవక్తుల ప్రయత్నముగాని, సహకారసంఘముల నిరంతరకృషి గాని

చాలదు. దొరతనమువారి సాహాయ్యము లేనిదే యీ విద్యా విధానము కొనసాగనేరదు. కొన్ని సహకారసంఘములు తమ సభ్యుల పిల్లల కిట్టి శిక్షణ మొసగబూనుకొని తమకుగల కొలదిమాత్రపు లాభములను అందులకై వ్యయపఱచినవి. అవి చూపిన యుత్సాహమును, త్యాగమును కడుంగడు ప్రశంసనీయములై యెల్లెడలను సర్వజనానుకరణీయములై యున్నవి; కాని సహకారసంఘములు చేయుకృషి గవర్న మెంటువారి యుద్యమమునకు సముచితానుబంధమై మాత్ర ముండజాలును; దేశమునుండి యవిద్యాపిశాచమును దొర తనమువారు తఱిమివేయకున్న యెడల, నున్నతసేద్యాభివృద్ధి గగనప్రసూనమగును.

ఋణభారమును, అవిద్యయు భారతభూమినుండి తొలగింపబడినను, భూమిసారము నధిక మొనరించుటకును, రైతునకు భాగ్యము చేకూర్చుటకును విశేషమగు నన్యకృషి యనివార్యము. చాలినంత యాహారము లేకుండుటచే, కృశించినశరీరము గలిగి, సేద్యమునకై ప్రాత పనిముట్లనే పొంది పొలములకు దగు నీటిసదుపాయములు లేక, యెముకలప్రోగు లగు యెద్దులను, అచటచట జీలియున్న పొలములను, చెడి పోయినవిత్తులను గలిగి, పండినధాన్యము నమ్ముటకు దగు నదుపాయములు లేక, అనుకూలసమయమున గింజల నమ్ము కొనుటకై వేచియుండజాలు దార్ఢ్యములేక, అనవరతము ఋణగ్రస్తుని రక్తమును దనివార పీల్చివేయు మహ్యాజులూరు

షావుకారుక్రౌర్యమునకు గుఱియగుచు కృషీవలుడు సేద్యము మూలమున నెట్టిలాభము నందజాలక, యిక్కట్టులనడుమనే పడి పెనగులాడుచుండును. ఇట్టి యిక్కట్టులనుండి రైతును దప్పించుటకై పృథ్వియం దెల్లచోటులందు సహకారము చాల కృషి సలిపి, అద్భుతమగు ఫలము నందెను. భారత దేశమందుగూడ సహకారము రైతుచేత కిట్టిఫలము నంద జేయజాలునని మనము విశ్వసింపవలెను. ఐరోపాఖండమందు వ్యవసాయము సహకారముమూలమున జాల యభివృద్ధి గాంచినది.

యూరపుదేశములం దవలంబింపబడిన సహకారపద్ధతు లేవియన:

1. సంఘీయులకు విడిగా • అనుకూల మగుధరల కొసగు టకై గృహాపరికరణములను, కమతపుపనిముట్లను మొత్తముమీద నొక్కమాఱు క్రయ మొన రించుట.
2. హెచ్చుధర గలపనిముట్లను సమిష్టిగా గ్రయ మొన రించి, సంఘమున కంతకు వానిపై హక్కొసగి, సభ్యుల ప్రత్యేకోపయోగమునకై వాని నొసగుట.
3. సభ్యుల ఫలసాయము నంతను గలిపి విక్రియ మొన రించుట.
4. విక్రయమునకై సంఘీయుల ఫలసాయము నొక్క మాఱుగా తయారొనరించి, అట్లు తయారైనపిదప దాని నమ్ముట.

ఈ సహకారవిధానము లన్నియు గృషికుల కెనలేని మహోపకారము గావించినవి. తొలిచొప్పున నాల్గవ విధానమును నవలంబించిన సంఘములు పడసిన విజయ మత్యద్భుతమైనది! ఇట్టి విధానములు భారతీయులుకూడ నవలంబించినచో నైరోపియన్ముల చొప్పున వారుకూడ వ్యవసాయమందు విశేషాభివృద్ధి నందజాలుదురని నొక్కి వక్కాణింపవచ్చును. ఈ సహకారవిధానములు పరిశ్రమలకు ముఖ్యముగ నేతను బోలు గృహపరిశ్రమలకుఁ జేయూత యొసగుట నిక్కము.

## సహకార క్రయముమూలమున గమతపుయక్కఅలను పడయుట:

విత్తులను, ఎరువులను, ఆహారపదార్థములను కొనునపుడు రైతు విశేషధనమును వెచ్చింపవలసివచ్చుచుండెను. ధనాఢ్యు లగువర్తకులు టోకుపై నీ పదార్థములను గ్రయమొనరింప మధ్యవర్తులు వీనిని గొని హెచ్చుధరలకు వ్యవసాయదారుల కమ్ముచుందురు.

ఇట్లొనరించుతఱి వస్తువుయొక్క నాణ్యమందును తూనికయందును వారు నిరుపేదలగు సేద్యకాండ్రను వంచించుచుందురు. ఇట్టి మధ్యవర్తులబారి బడకుండుటకై కృషికసంతతికి గావలయుపదార్థము లన్నిటి నొక్కమాఱుకొని, వానిని సంఘీయులందు పంచిపెట్టవలెను. ఇట్టియేర్పాటువలన సభ్యులు

చాల లాభముల నందజాలుదురు. ఈ యేర్పాటుమూలమున టోకుధరలకును, చిల్లరి వెలలకును గలభేదము మధ్యవర్తుల పాల్పడక, లాభరూపమున సంఘీయులకే చెల్లును. సంఘము కొనెడి పదార్థముల పరిమాణ మధికమగుటచే, పెద్దవర్తకులు సంఘముయెడ విశేషగౌరవముజూపుదురు. ఇట్టి ప్రవర్తనమువారు చిల్లరివెలకు వస్తువులనుగొనెడి ప్రత్యేక వ్యవసాయదారునెడ జూపకుండుట యక్కజముకాదు. ముఖ్యముగ మనము గమనింపవలసిన విషయ మేమన నాణెముగల వస్తువులనుమాత్రమే సంఘము క్రయ మొనరించును. పోటీవలన పదార్థముయొక్కగుణము నిర్ణయింపవలసివచ్చినపుడు బజారున కరిగి, పల్వురు వణిజులకడ వస్తువులను పరిశీలించి అనుకూల మైనవానిని బుచ్చుకొనును. కాని ప్రత్యేకముగ గింజలను గొనదలచిన రైతు తనకు పైకము నప్పుగా నిచ్చిన షావుకారుమహాశయునియొద్ద ఆతడు చెప్పినధరకు ఆతడీయదలచిన నాణెముగలవానిని గొని తీరవలెను. విశేషపరిమాణము గలపదార్థములను సంఘ మొక్కమాటే తెప్పించుచో పడవఖర్చులుగాని, రైలుఛార్జీలుగాని తక్కువయగును; కాని విడిగా వానిని గొనెడి రైతు ప్రతి సరకుమూటకు ఛార్జి చెల్లింపవలసియున్నందున, ఆతడు హెచ్చుమొత్తమును వెచ్చింపవలసి వచ్చుచుండును. సభ్యుల సంఘీభావముచే బలయుతమైనసంఘము కావలసినపదార్థములను అనుకూలమైనసమయమందే కొనజాలును.

రైతులకు పదార్థము లవసరమైనపుడుమాత్రమే సంవత్సరమునకు రెండు పర్యాయము లీసంఘము సమావేశమగును. ఇది యొక గొప్ప లోపము. వస్తువులను గొనుటకు మాత్రమే సంఘీయులు చేయుచుండుటచే, సంఘాభ్యుదయమందభిలాష చూపకున్నారు. అందుచే సంఘములు తఱచుగా గుంటుపడిపోవుచుండును. సంఘీయులు తాము కొనిన పదార్థము ప్రయోజనయుతమైనగాని దాని కగువెలను సంఘమునకు చెల్లింపకుండుట మఱొక లోపము. ఎరువును గొనిన వ్యవసాయదారు డామెరువువలన మంచిపంట పండి దాని లాభము గోచరించినపిదపనే దాని కగువెలను చెల్లింప నిష్టపడును. అందుచే టోకుగా వస్తువుల నిచ్చిన వర్తకసంస్థకీయవలయు పైకమును సకాలమున జెల్లింపనేరక సంఘము ఋణపడవలసి వచ్చుచుండును. వ్యవసాయమునకు గావలయు వస్తువులతోపాటు గృహోపయోగమునకై వలయు పదార్థములను గొనుట మిగుల ననుకూలముగా నుండును. కాని ప్రతి రాష్ట్రమందును టోకుగా వస్తువుల నిచ్చు వ్యవసాయ సంఘము లున్నగాని సాధారణ సహకార సప్లయిసంఘములు గృహోపయోగమునకు గావలయు పదార్థములను పల్లీయుల కిచ్చుటందు నిరాడంబరియై, గ్రామస్థులకు జిరపరిచితుడైన కోమటితో పోటీ జేయజాలవు. కాని యిట్టి సప్లయిసంఘములనేకములు గలిసినచో వ్యయమును, వస్తునష్టమును తక్కువ

యగును. అప్పుడవి పోటీవర్తకమందు పల్లెవైశ్యు నోడింప జాలును.

డెన్మార్కు దేశమందలి పల్లెప్రదేశములందిట్టి సంఘములు విశేషముగా పొడసూపినవి. ఇందలి సభ్యులందు నూర్గురకెనుబదిమంది వ్యవసాయదారులై యున్నారు. గృహోపయోగమున కవసరమగు పదార్థములను పల్లీయులకు సప్లయిచేయుట వీని ముఖ్యోద్దేశము. డెన్మార్కు దేశము యొక్క దృష్టాంతరము నల్పవిస్తీర్ణముగలభూమి ఖామందులంద అనుకరించుట ఉచితము. భారతభూమియందు కృషికుల యధీనమందున్నవి స్వల్పవైశాల్యముగల భూములే. అందుచే డెన్మార్కు పద్ధతులనుమన మనుకరింపదగినవేయని తోచును. కాని, హిందూదేశమందలి ప్రస్తుత పరిస్థితులను పరిశీలించితిమేని, యీ యనుకరణము సముచితము కాదని తోపక మానదు. డెన్మార్కు దేశమందలి వ్యవసాయదారులందఱు విద్య నేర్చినవారు. పరిశ్రమజీవనము సలుపువారికంటె సేద్యవృత్తియందున్నవారి సంఖ్యయే ఆ సీమయందధికముగా నున్నది; కాని మనదేశమందన్నో కృషికసంతతి అజ్ఞానాంధకారమున మునిగి యున్నది. జర్మనీదేశమందలి వ్యవసాయదారుల పరిస్థితులును మనదేశమందలి సేద్యకాండ్ర స్థితిగతులు నొకే తెఱగున నున్నవి. రైఫిసిన్ మహాశయుడు జర్మనీలోని కమతముదారులకు సాహాయ్యము సలుపుటకు వేరుపథము

నన్వేషించెను. రైఫిసిన్ సంఘములు జర్మనీపల్లీయులకు మహోపకారముచేసిన చరిత్రలు మన కద్భుతము గొలుపకమానవు. జపాను దేశములో గూడ క్రయము, విక్రయము మున్నగు క్రియలు పరపతిపనులతోడనే జరుపబడుచుండునని ఆ దేశపు పల్లెసహకారచరిత్రము తెలుపుచున్నది.

పరపతి సంఘము యొక్కయు, సప్లయి సంఘము యొక్కయు క్రియల కలయిక ఐర్లండు, జర్మని, ఆష్ట్రియా, బెల్జియమ్, స్పెయిన్, జపాన్ దేశములందు గోచరించుచున్నది. మన పల్లెలందు మేధాసంపన్నులును, విద్యావంతులును మిగుల తక్కువగా నుండుటచే, డెన్మార్కునందలి సంఘవిధానముగాక, జర్మనీ దేశమందలి సంఘవిధానమే భారతసీమయం దనుకరణీయమని గ్రహింపవలెను.

ఈ సంఘములనుగుఱించి మక్లాగన్ కమిటీవారు
తమ నివేదికయం దిట్లు తెలుపుచున్నారు:

"వ్యవసాయ పరప తేతర సంఘములు ముఖ్యముగ విత్తులనువ్యవసాయపు పనిముట్లను సప్లయిచేయు సంఘములు పరపతిసంఘములతో జేర్పవచ్చును. పెక్కు పరపతిసంఘములం దిట్టి కలయిక కానవచ్చుచున్నది; ప్రత్యేకభాగమును గుఱించి ప్రత్యేకముగా లెఖ్ఖలు తయారు చేయుబడుచుండును; కాని పరపతి, పరప తేతరభాగముల సభ్యు లొక్కరై యుందురు. ఇట్టి సంఘనిర్మాణముల మూలమున నాణెమైన విత్తులను

పెంచి, పంచు విధానము విశేషముగ మధ్యపరగణాలయందు జూపట్టెనది. ఈ విధానము కేంద్రీకరింపబడి, యొక సెంట్రలు బ్యాంకునకు విడువబడుటయు లేక ప్రత్యేక ప్రదేశమున ప్రధానసంఘముచే నడుపబడుటయు ప్రత్యేక కార్యక్రమము ననుసరించి నిశ్చయింపబడవలెను. తాను తెప్పించుచున్న పదార్థములకు ఏ సంఘముగాని యధికారియై యుండవలెనని మేము తలపము. సభ్యులపక్షమున కమీషనునకు గాని, మఱి యట్టి యే యితర యేర్పాటువలన గాని సంఘము టోకుగ క్రయవిక్రయములను సలుపుచుండవలెను."

జర్మనీ, ఆస్ట్రియా, బెల్జియమ్, స్పెయిన్ దేశము లందువలె భారతపరిస్థితుల ననుసరించి పరపతి, సప్లయల సమ్మేళనా విధానము చెన్నపురి రాజధానియందు గలదు. దీనిని గుఱించి బొంబాయి సహకారపత్రికయందు డిశంబరు, 1919 సంవత్సరమున ఎఫ్. ఆర్. హెమింగ్ వేగా రిట్లు వ్రాసిరి:

"ఏగ్రామమందైన గొన్నివస్తువుల నొక్కమాఱుగ దెప్పింప నుద్దేశించినపుడు, పల్లె పంచాయతి గ్రామస్థులను రప్పించి యెవరెవరి కెన్ని పదార్థములు కావలెనో విశదముగ వ్రాసికొందురు. ఇట్లు తమకై తెప్పింపబడు నిర్దిష్టపు మొత్తపువస్తువులను పల్లీయులు పైకము చెల్లించి గాని, సంఘమునుండి యప్పుదీసికొని తామీయవలయు వెల నిచ్చి వేయవలెను. అవసరమగునెడల సరకు ధరలుగాని యప్పుపై

క్రమముగాని ముందే యీయబడవలెను. అపుడు సెంట్రలు బ్యాంకుద్వారా యీధనమును చెల్లించు నేర్పాటున టోకు మొత్తముగా వస్తువులను దెప్పించి పల్లీయులకు సంఘము పంచివేయవలెను. అనేకసంఘములు కలిసి తమకు గావలసిన పదార్థముల నొక్కమారుగా దెప్పించుకొనినయెడల, చాల సదుపాయముగా నుండును. అజమాయిషీ చేయు లోకలు యథానియ (స్థానికసంస్థ) నునకు సంబంధించిన సంఘము లన్నియు, తమకు వలయు వస్తువులను దెప్పించుటకు దగు యేర్పాటును యూనియనులే జేయుచుండును. విశేష వైశాల్యముగల ప్రదేశమందలి సంఘములన్నియు దఱచుగా వాణిజ్యసంఘముగా (Trade Union) గలియుచుండును. ఈవర్తకసంఘమందు షేరులను దీసికొనుచు దమకు సరకుల నప్పగించు పనిని యవి యీసంఘముపై విడుచును.

సంఘములు చెల్లించిన భాగధనము గాని, సంఘములును, ప్రత్యేకవ్యక్తులును జెల్లించిన భాగధనముగాని విశేషముగ నీవర్తకసంఘములను జేరుచుండును. పరపతిసంఘములకు సభ్యతాస్థాన మొసగి వానిమూలమున బనిచేయుచుండు సాధారణపట్టణ సహకారస్టోర్సులనుండి యీవర్తకసంఘము లపుడపుడు నిర్మింపబడుచుండును. ఈవర్తకసంఘములు తమ కనుబంధింపబడి యున్న సహకారసంఘములనుండి వానికి గావలయు నిర్దిష్టవస్తు వివరముల నెఱిగి వానిని టోకుగా దెప్పించుచుండును. ఈవర్తకసంఘములు పనిపాటలందు మంచి

యనుభవముగల యుద్యోగులను నియోగింపజాలును. ఈ యుద్యోగులు పల్లె పంచాయతీయందు బనిచేయువారికంటె నధికసామర్థ్యము గలవారగుటచే నే సహాయమునంద పరపతి సంఘములకంటె వర్తకసంఘముల కార్యవిధానము అనేక మడుంగులు బాగుగనుండును.

"1918–19 సంవత్సరమున చెన్నపురి రాజధానియందిట్టి వర్తకము చాల వృద్ధిజెందెను. ఒకచోటునుండి మఱొక తావునకు సరకులను రవాణాచేయుట యందును, గావలసిన వారికి పదార్థముల నందజేయుటయందును పెక్కు చిక్కులు కలిగినను, గృహోపయోగములైన వస్తువులధర పెరుగుటచే నిట్టివర్తకము యభివృద్ధి గాంచినది. 200 పల్లెసంఘములు మూడులక్షల రూకల వర్తకముచేసెను; సభ్యులు రమారమి రు 60,000 లు లేక•నూటికి కిరువైచొప్పున లాభమును పడసిరి. బియ్యము, ఉప్పు, గింజలయెరువు, కిరసనాయిలు యీ వర్తకమున ప్రాముఖ్యతగాంచిన పదార్థములు. ఈవాణిజ్యము క్రమక్రమాభివృద్ధి నందుచున్నది. * ఈదిగువ దెలిపిన లెక్కలను బట్టి వాణిజ్యసంఘములు విశేషముగ నభివృద్ధిగాంచి,

1920–21 సంవత్సరమందలి చెన్నపురిని వేదిక వర్తకసంఘము లాయెడున జేసిన కృషియంత తృప్తికరముగా లేదని తెలుపుచున్నది. రిజిస్ట్రారు యొక్క నివేదికను విమర్శించుచు. 1922, ఏప్రియలు నెలలో చెన్నపురి సహకారపత్రిక యిట్లు వ్రాసియుండెను: ,,వర్తకసంఘములును, స్టోరులును వెనుకబడినవి. అవిచేయు పనులందు దగ్గర్దల యంతగా గోచరింపకున్నను,

పల్లీయులకు మహోపకారము గావింపగలవని యూహింపజాలుదుము. చెన్నపురి రాజధానియందలి పల్లె సంఘములందు 1,70,000 లకు మించిన సభ్యులుకలరు. ప్రతి పల్లీయులకు సంవత్సరమునకు సహకారసదుపాయము మూలమున దామాషాయిని 200 రూకల విలువగల వస్తువులను యితర తావులనుండి రప్పించుకొనవలసి యుండును. తనకు గావలసిన పదార్థములను ప్రతిసభ్యుడును సహకార క్రయముద్వారా పడయుచో,—నూటికి పది యెక్కువగానట్లు పైకము నిలువ వేసికొనునట్లు వ్యాపారమును జరపునెడల మధ్యవర్తుల చేతుల

---

* పెక్కు సంఘములు విశేషనష్టమునకు పాల్పడినవి. నిలువవేసిన వస్తువుల ధరలు పడిపోవుట యీనష్టమునకుగారణము. సామర్థ్యములేని పాలనమును, సభ్యులందు సఖ్యము లేకపోవుటయు గూడ నీ నష్టమునకు హేతుకము. రెండేండ్లకు పూర్వము బియ్యమందు కరవు సంభవించుటచే బర్మా బియ్యమును పడయుటకు దగు సౌకర్యములను సహకారపరపతి సంఘములు పడసినవి. కాని, కడచిన సహకారసంవత్సరమున బర్మానుండి బియ్యమును రప్పింపవలసిన యక్కఱ లేకపోయెను. అందుచే పరపతిసంఘములందలి పరపతేతరపనులు చాలవఱకు తగ్గిపోయినవి. పరపతిసంఘములను పాలించుటకంటె స్టోరులను (వ్యవసాయమునకు సంబంధించిన వైనను, వ్యవసాయేతర వ్యాపారములకు సంబంధించిన వైనను) పాలించుట కష్టతరము. అందుచే నవియే చాలగా క్రుంగిపోయినవి. అట్లని మనము నిరుత్సాహులము కాక వానిని నెలకొలిపి వృద్ధిపఱచుటకు శక్తివంచనలేక ప్రయత్నింపవలెను.

నుండి తప్పించి, పల్లెసహకారుని చేతులం దుంపజాలు ధనము సంవత్సరమునకు 34 లక్షల రూకలకు తక్కువగా నుండదు. అచిరములో నిట్టి ఫలితమును పడయుట కెట్టి కష్టముగాని యుండదని మనము నొక్కి వక్కాణింపవచ్చును. పరపతిసంఘముల నన్నిటిని వాణిజ్యసంఘముల కనుబంధించి, వాణిజ్య సంఘములను, విశేషముగ టోకువ్యాపారము జరపు ఒకటి రెండు పెద్ద వాణిజ్యసంఘముల యధీనమం దుంచితిమేని, యిట్టి వ్యాపార మత్యద్భుతముగ నభివృద్ధి గాంచగలదని నొక్కి చెప్పవచ్చును.

చెన్నపురి రాజధానియందు గలిగిన ఫలితము లితర రాష్ట్రములందు గూడ గలుగవచ్చును. కాని చాలరాష్ట్రములందు అజమాయిషీచేయు యూనియనులు లేకుండుటచే, నీ ఫలములు అల్పముగా చేకూఱవచ్చును. ప్రతి రాష్ట్రమందును నిట్టి విధానము అనుకూలమగు నొక్కొకచోటునందు స్థాపింపబడుచో, నేటేట మధ్యవర్తులు హస్తగత మొనరించుకొను ధనమునంతయు తామే యనుభవించుచు, పల్లీయు లవలీలగ జీవనతరణిని నడపుకొన జాలుదురు.

ఉన్నతనిర్మాణకౌశలమున, బ్రిటిషుయిండియా యందలి 32,500 పరపతిసంఘములలో గల పదివేలమంది సభ్యులును టోకువ్యాపారము జరపు రాష్ట్రవాణిజ్యసంఘము (Provincial Whole-sale Trading Societies) లందు జేర, నాసంఘములన్నియు నొక యఖిలభారత టోకుసం

ఘము'గా సమ్మిళితమగుచో, అవసరములేని మధ్యవర్తుల చేతులనుండి వెల్వడి పల్లెసహకారుల జేబులం దేఁటబడు ధనము హరించుటవేగారి లెఖ్ఖచొప్పున 200 లక్షల రూకలకు దక్కువగా నుండదు.

వివిధక్రియల సమ్మేళమున స్థాపింపబడు సంఘములే గాక, వ్యవసాయమునకై కావలయు వివిధ పదార్థములను పడయుటకై ప్రత్యేక క్రియాసంఘములుకూడ తల లెత్తుచుండుట ముదావహాము. ప్రత్యేక ఎరువు సంఘములను, విత్తుల సంఘములను, గమతవు బనిముట్ల సంఘములను భారతసీమ యందు జూచుచున్నారము. ఈసంఘముల యభివృద్ధి నించుక పరిశీలించెదము.

## ఎరువు సమకూర్చు సంఘములు.

(To be continued)

---

రాజమహేంద్రవరము : శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే
సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రింపఁబడియె. 6551—1931